Come! Let us Change This World.
(Telugu)

# రండి! ఈ ప్రపంచాన్ని మారుద్దాం!!


మూలం

**మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది**

అనువాదం

**అబ్బాదుల్లా**

# విషయ క్రమం

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# మొదటి భాగం

## ముస్లిములు - పాశ్చాత్య దుష్ప్రభావ వెల్లువ

"వారు తమనుగురించి తాము ఎన్నడూ ఆలోచించలేదా? అల్లాహ్ భూమినీ, ఆకాశాలనూ, వాటి మధ్య ఉన్న సమస్త వస్తువులనూ సత్యంతో, ఒక నిర్ణీత గడువు వరకు మాత్రమే సృష్టించాడు. కాని చాలామంది తమప్రభువుతో సమావేశం కావలసి ఉన్నది అనే విషయాన్ని తిరస్కరిస్తున్నారు."

(అల్ ఖుర్ఆన్ - 30 : 8)

"వారు అల్లాహ్‌ను కాదని ఇతరులను దేవుళ్ళుగా చేసుకున్నారు. తమకు సహాయం చేయటం జరుగుతుందని వారు ఆశలు పెట్టుకున్నారు."

(అల్ ఖుర్ఆన్ - 36:74)

"విశ్వాసులారా! మీపక్షంవారిని తప్ప ఇతరులెవ్వరినీ మీకు ఆంతరంగికులుగా చేసుకోకండి. వారు మీకు హాని కలిగించే ఏ అవకాశాన్నైనా ఉపయోగించుకోవటానికి వెనుదీయరు. మీకు నష్టం కలిగించేదే వారికి ప్రీతికరం. వారి కడుపుమంట వారి నోటి నుండి బయట పడుతుంది. కానీ వారు తమ హృదయాలలో దాచివుంచింది దీనికంటే తీవ్రమైనది." (అల్‌ఖుర్ఆన్ :3:118)

"అబూ లహబ్ చేతులు విరిగిపోయాయి! అతడు సర్వనాశనం అయిపోయాడు! అతడి ఆస్తిపాస్తులు, అతడి సంపాదన అంతా దేనికీ పనికిరాకుండా పోయింది." (అల్ ఖుర్ఆన్ : 111: 1-2)

## పాశ్చాత్య నాగరికత పునాదులు: మతం పట్ల ప్రతీకార చర్య

పునరుద్ధరణోద్యమం మధ్య యుగంలో పాటించబడుతున్న క్రైస్తవ మతంతో ఢీకొంది. ఈ ఘర్షణ ఒక్క యూరపు ఖండాన్నే కాదు యావత్ప్రపంచాన్నే

భయాందోళనలో ముంచేసింది. ఆదిలో క్రైస్తవ వర్గానికి చెందిన వారు, ఆ మత పండితులు వారి మత విశ్వాసాల శిఖరాగ్రాల్ని, విశ్వం మరియు మానవుని పట్ల తమకున్న తలంపుల్ని గ్రీకు ఫిలాసఫీ, సైన్సు ప్రబోధనాలు, తత్వజ్ఞానం మరియు అది అందించే సమాచారం ప్రకారం మలచుకొన్నారు. ఇలా ఏర్పరచుకొన్న పునాదులకు ఏ కొద్ది అపాయం కలిగినా వాటిపై నిర్మించుకొన్న భవనం ఒక్క మారుగా కూలిపోతుందనే భయం వారికి కలిగింది, దానితోపాటు వారి మతం కూడా తుడుచుకుపోతుందని వారు తెలుసుకొన్నారు. అందుచేత గ్రీకు ఫిలాసఫీ, విజ్ఞాన శాస్త్రాల ఆధారంగా వారు స్థాపించుకొన్న సిద్ధాంతాలను ఎవరైనా విమర్శిస్తే లేక వాటిపై పరిశోధనలు చేస్తే సహించలేక పోయారు. వారు నిర్ణయించుకొన్న భావాలకు అన్యంగ ప్రకటించే ఇతర ఫిలాసఫీ భావాలను వినేందుకు కూడ వారు సిద్ధపడలేదు. ఇక వారి భావ పాండిత్యాన్ని మార్చుకొనే అవసరం వస్తే ఏ మాత్రం సహించలేకపోయారు. మానవుడు, ప్రపంచం పట్ల బైబిల్‌లో ఇవ్వబడిన నిర్వచనాలను, వారు అంగీకరించిన సిద్ధాంతాలపై ఎవరైనా విజ్ఞాన పరంగా పరిశోధనలు జరుపడానికి, వాటిలోని ఏ భాగాన్నైనా తృణీకరించడానికి ఎవరినీ అనుమతించేవారు కారు. అలాంటి ప్రయత్నం వారి మతానికి, మత పరంగా ఏర్పరచుకొన్న సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక విధానాలకు అపాయకరం అని తలంచారు. దీనికి వ్యతిరేకంగా పునరుద్ధరణోద్యమం ప్రభావంతో విమర్శలు, పరిశోధనలు, నూతన విషయాలను కనిపెట్టుతూ పని చేస్తున్న ప్రజలు అడుగడుగున ఏ ఫిలాసఫీ ఆధారంగా చేసికొని క్రైస్తవులు తమ విశ్వాసం, మతం నిర్మించుకున్నారో వాటిలోని బలహీనతల్ని చూడసాగారు. ఈ విధంగా వీరు తమ పరిశీలనలో పురోగమిస్తూ వెళ్తుంటే, చర్చి అధినేతలు రాజకీయ, మతశక్తుల ప్రోద్బలంతో బలవంతంగా వీరిని తమ పరిశోధనల నుండి ఆపేందుకు ప్రయత్నించారు. కాని అప్పట్లో అంగీకరింపబడే అనేక సిద్ధాంతాలలో అనేక విషయాలు సత్యవిరుద్ధమైనవని తెలియవచ్చాయి; మరీ క్షుణ్ణంగా ఇప్పుడు అందరి దృష్టిలో పడ్డాయి కూడ. కాని చర్చి అధినేతలు తలబిరుసుతనాన్ని వహించారు. ఏ నిర్వచనాల్ని వారు నమ్ముతూ వచ్చారో వాటిలో మార్పు చేయడానికి నిరాకరిస్తూ, క్రొత్త వెలుగు

చూచిన కన్నుల్ని గ్రుడ్డిపరుస్తూ వచ్చారు. ప్రజ్ఞతకల మేధావులు ఇంతకు ముందు ఏ సిద్ధాంతాలను పరిపూర్ణమైనవి అని, వాటి విశ్వాసాల పట్ల నిరూపణ ఇస్తూ వచ్చారో వాటిలో ఎన్నో రుగ్మతలు ఉన్నాయని తెలుసుకొన్నారు.

కాని చర్చి అధికారులు ఈ నూతన పరిశోధనల వెలుగులో తమ సిద్ధాంతాల్ని పునఃపరిశీలన చేయడానికి నిరాకరిస్తూ క్రొత్త విషయాలను కనుగొన్న బుర్రల్ని బ్రద్దలు చేస్తూ వచ్చారు.

ఈ వైరుధ్యం మతానికి, మతానుచరుల మధ్య తలబిరుసుతనం కలవారికి వైషమ్యం కల్గించింది. ఒక నూతన విజ్ఞాన మేల్కొలుపుకు అవరోధం కల్గింది. మతోన్మాదులు సాగించే చిత్రవధలు ఎక్కువైనకొద్దీ, వారిలోని తలబిరుసుతనం కూడా హెచ్చైంది; ఈ మొండితనం క్రైస్తవ మతానికి, చర్చి అధికారానికి మాత్రమే ప్రతీకార చర్యకు పరిమితం కాకుండా పూర్తి మతాన్నే తుదముట్టించేందుకు ఒడిగట్టింది. ఈ క్రొత్త వికాసానికి, క్రొత్త సంస్కృతికి వెన్నుదన్నుగా నిలిచిన వారు మతాన్ని ఒక మోసంగా చిత్రిస్తూ, శాస్త్రపరమైన హేతువాదం ముందు మతం నిలవజాలదన్నారు. మత సిద్ధాంతాలు తత్వ వాదనల ఆధారంగా లేవు, మూఢనమ్మకాల ఆధారంగా ఉన్నాయి. ముసుగు వేసుకొని ఉన్న ఈ కపటాన్ని బహిర్గతం చేస్తే పరిశోధనలవల్ల పొందిన వెలుగులో అవి కృశిస్తూ అదృశ్యమవుతాయి అని వారు నొక్కి చెప్పారు. (ముసల్‌మానోం కా మాజి-ఒ-హాల్ ఔర్ ముస్తఖ్‌బిల్ కే లియె లాహ్- యె- అమల్ 2.11.1951 ప్రసంగం పేజి19-21)

## మతం పట్ల ప్రతీకార చర్య నవనాగరికతపై దాని ప్రభావం

విజ్ఞాన పరిశోధకులు మతానుచరుల మధ్య చెలరేగిన మధ్యయుగపు వివాదం కేవలం విషయపరిజ్ఞానం వరకే పరిమితం కాకుండా, రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాల వరకు వ్యాపించింది. చర్చి అధికారం ఈ వివాదంలో

పరాజయమైంది. నవనాగరికతను సమర్థించే వారి అజమాయిషీలో ఒక నూతన జీవిత విధానపు నిర్మాణం పైకి రావడమయింది. ఫలితంగా అప్పుడు రానున్న మానవాళిపై ప్రగాఢంగా పనిచేసే రెండు పరిణామాలు కలిగాయి.

ప్రథమంగా, నవజీవన విధానపు ప్రతి శాఖనుండి 'మతం' అనేది ఆచరణాత్మకంగా విసర్జింపబడింది. మతం అనేది వ్యక్తిగతంగా స్వంత నమ్మకాలకు, చర్యలకు పరిమితమైంది. రాజకీయాలలో, ఆర్థిక విషయాలలో, పౌరనైతికతలో, న్యాయశాస్త్రంలో, విజ్ఞాన విషయాలలో ఇంకా సామాజిక జీవితంలోని ఇతర భాగాలలో మత ప్రమేయానికి ఎలాంటి హక్కు లేదన్న భావన నవనాగరికత పునాదులలో తప్పనిసరి భాగం అయింది. మతం అనేది వ్యక్తి సొంత విషయం అయింది. ఒక వ్యక్తి తన ప్రైవేటు జీవితంలో దైవాన్ని దైవ ప్రవక్తల్ని విశ్వసించదలిస్తే అలాగే చేసుకోవచ్చు, ఇంకా వారి హితవులను పాటించదలిస్తే వాటిని అనుసరించవచ్చు. మతం అనేది సంపూర్ణ సామాజిక జీవన విధానంలో ఏ హితవులనిస్తుంది అనే ప్రశ్నకు ఆ నూతన విధానంలో ఏ చోటు లేకపోయింది.

రెండవ విషయం: ఈ నవ నాగరికత అంటే పడి చచ్చేంత మూర్ఖత్వం, మత రాహిత్యమైన మనసత్తత్వం ఇందులోని అంతర్జీవంతో పెనవేసుకొంది. కళలు, శాస్త్ర విజ్ఞానం ఎంత అభివృద్ధి చెందినా, మతానికి వ్యతిరేకంగా చెలరేగిన తలబిరుసుతనం మాత్రం ఈ నవనాగరికత అనుచరులలో ప్రగాఢంగా నాటుకొనిపోయింది. అలాంటి మేధావుల వల్ల అభివృద్ధి చెందుతూ వచ్చిన ఈ నవ నాగరికత ఎక్కడ చేరుకొన్నా అక్కడ మతబోధనలు అనేవి, అవి దైవ విషయం కానీయండి, మరణానంతర జీవిత విషయం కానీయండి, దైవబోధనల అవతరణ మరియు ప్రవక్తలు రావడం కానియ్యండి, సందేహాస్పదమైనవి అన్న భావం వ్యాప్తిలోకి వచ్చింది. వాటి విషయంలో నమ్మతగ్గట్టు నిరూపణ చేయాల్సి ఉంది. అలా సాధ్యపడకపోయినట్లయితే మతాన్ని నిరాకరించాల్సిందే అన్న అభిప్రాయం ప్రచారంలోకి వచ్చింది. ఈలాంటి భావనలు కల మనస్తత్వం పాశ్చాత్య తత్వ విధానంపై సంపూర్ణంగా పనిచేయడమయింది. ఈ మనస్తత్వం సైన్సు,

లిటరేచరును మత పరిధి నుండి వేరు చేయడమే కాకుండా దైవరాహిత్యమైన, మరణానంతరం తీర్పు జరిగే సిద్ధాంతాల ప్రమేయంలేని సామాజిక, లౌకిక తత్వ విధానాల నిర్మాణానికి దారి తీసింది. (Ibid, పేజి:21-23)

## పాశ్చాత్య ప్రభావంపై ఒక దృష్టి

గతంలోని నాగరికతలు, అనేక బలహీనతలవల్ల, అంతమైనప్పుడు, అందులోని ఉత్తమ గుణాలను రాబోవు నాగరికతలకు అందివ్వడమైందని హేగల్ బోధించిన నాగరికతాభివృద్ధి సిద్ధాంతం ప్రజలలో నమ్మకం కలిగించింది. విపులంగా చెప్పాలంటే మేము ఏనాగరికతలో జీవిస్తున్నామో ఆ నాగరికత, పూర్వపు నాగరకితల్లోని ఉత్తమ ఆదర్శాలతో ఏర్పడిందన్నమాట. ఇక ఇది ప్రగతి సాధించాలంటే నూతన భావాలు వెలుగులోకి రావడంపై ఆధారపడివుంది. ఈనూతన భావాలు ప్రస్తుత నాగరికతయందలి మూల సిద్ధాంతాలనే ఛాలెంజి చేయవచ్చు. గడచిన యుగాలవైపు మరలి చూస్తే అందులో అవగాహన చేసుకొనేందుకుకాని, మార్గంచూపేందుకుకాని, వాటిలో ఏమీగోచరించడం లేదు అని అంటుంది ఈ సిద్ధాంతం. ఎందుకంటే ఈ సిద్ధాంతం దృష్టిలో తరువాత వచ్చినకాలంలోని నాగరికతలలో ఏ విషయాలు గతంలో నుండి సేకరించబడలేదో, ఆ విషయాలు లోపభూయిష్టమయినవని చరిత్రనొక్కి చెబుతూంది. ఇంకా చరిత్ర అవగాహనవల్ల స్పష్టమయ్యేదేమంటే గతంలో ఏదైనా అమూల్యమైంది ఉంటే అది ఆకాలంలో గౌరవింపదగ్గదిగ ఉంది. అది నాగరికతాభివృద్ధిలో దోహదపడిందని చెప్పవచ్చు. కాని ఈనాడు దానికి విలువలేదు. అది మరొక సారి మన నాగరికతాభివృద్ధికి దోహదపడలేదు. ఎంచేతనంటే అది విసర్జించదగ్గదిగా, ఆమోదయోగ్యంకానిదిగా చరిత్ర నిర్ణయించడం అయింది. ఇదీ హేగల్ సిద్ధాంత సారాంశం.

ఈ తత్వం ఎంత లోపభూయిష్టమయిందో, ప్రమాదకరమయిందో మనం గ్రహించవచ్చు. ఎవరయినా ఒక వ్యక్తి ఈ సిద్ధాంతాన్ని అంగీకరిస్తే ఆ వ్యక్తి మస్తిష్కంలో దైవానుగ్రహాన్ని పొందిన హజ్రత్ ఇబ్రాహీం (అలై), హజ్రత్ మూసా (అలై) మరియు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)ల కాలంపట్ల విలువ

ఉంటుందా? అలాంటివ్యక్తి నాటి ముఖ్యమయిన, ఉన్నతమైన హితవులను జీర్ణించుకునేందుకు, మహాప్రవక్త కాలంవైపు, చక్కటి హితవులనిచ్చే ఖలీఫాల కాలంవైపు మరలడానికి సాధ్యమవుతుందా?

సూక్ష్మంగా పరిశీలిస్తే ఈ (హేగల్) సిద్ధాంతం ఉద్దేశ్యపూర్వకంగా తాత్విక జ్ఞానంపై ధ్వజమెత్తడానికి నిర్ణయించిందని తెలుస్తుంది. ఈ సిద్ధాంతపు దురాగతానికి ఆహుతి అయిన వ్యక్తిలో మతపరమయిన భావాలు సమూలంగా నిర్మూలించబడతాయి. (లాయిహె అమల్, Ibid, పే: 26-27)

## ప్రపంచం ఒక యుద్ధ మైదానం - డార్విన్

డార్విన్ ప్రభావానికి ఆహుతి అయిన వ్యక్తి ఈ విశ్వం ఒక యుద్ధమైదానం, అది సజీవంగా ఉండడానికి (ఇక్కడ నిరంతరం అన్ని వైపుల) పోరాటం జరుగుతూందని, ఇక్కడ బ్రతుక తలంచే ప్రతి జీవి పోరాటం సాగించేట్లు, ప్రత్యర్థి జీవుల్ని పరాజయం చేసేటట్లు ప్రకృతి చేయబడిందని, ఎవరైతే బ్రతకడానికి శక్తి కలవారుగా నిరూపించబడతారో వారే ఇక్కడ ఉండడానికి అర్హులు అనే స్వభావం ప్రకృతి సారాంశం అని నమ్మాడు. ఈ దయలేని విశ్వంలో ఎవరైతే విచ్ఛిన్నమై పోతారో వారు తమ అంతిమ దశకు చేరాల్సిందే, బలహీనులు విచ్ఛిన్నం కావలసిందే. ఎవరైతే మనగలుగుతారో వారు సజీవంగా ఉంటారు; బలం కలవారే సజీవంగా ఉండదగినవారు. ఈ భూమి, అందులో ఉన్న సంపద, వనర్లు, ఇంకా సమస్తం బలవంతుల సొత్తు, వారే ఇక్కడ జీవించే అర్హత కలవారని నిరూపించుకున్నారు. బలహీనులకు ఈ వస్తువులలో ఎలాంటి హక్కులేదు. వారు బలవంతులకు లొంగి ఉండాల్సిందే. ఒకవేళ బలవంతులు బలహీనులను తొలగించి లేదా సంహరించి వారి స్థానాన్ని ఆక్రమిస్తే అందులో ఏమీ అన్యాయం లేదు, వారికాహక్కు ఉంది.

విశ్వంపట్ల ఇలాంటి అభిప్రాయం, ప్రకృతి స్వభావస్వరూపాల పట్ల ఇలాంటి సిద్ధాంతం మనిషి మస్తిష్కంలో చోటు చేసుకొంటే ఆ మనిషి తోటి

మానవుల మధ్య ఎలా మారగలడో యోచించండి. ఇలాంటి జీవిత విధానాన్ని బోధించే తత్వంలో దయ, దాక్షిణ్యం, త్యాగం మరియు ఇతర మహోన్నతమైన మానవ సుగుణాలకు స్థానం ఉంటుందా? ఇలాంటి దృక్పథంకల వ్యవస్థలో న్యాయం, ధర్మం, నమ్మకం, సత్యం, సన్మార్గం లాంటి ఉత్తమ గుణాలకు చోటు ఉంటుందా? బలహీనులైన సత్ప్రవర్తన కల వారికి ఇక్కడ ప్రాధాన్యత ఉంటుందా? దౌర్జన్యం 'పాపం'గా పరిగణించబడుతుందా? దౌర్జన్యం సాగించే బలవంతులు శిక్షింపబడతారా? మానవుల్లో ఎప్పుడూ తగవులు వైరుధ్యాలు ఉంటూనే వచ్చాయి. కాని గతంలో దీనికి కారణం ప్రకృతి విరుద్ధంగా ప్రవర్తించడమనే తలంచారు. ఇప్పుడిది ప్రకృతి నైజిక గుణమని తప్పనిసరిగా దౌర్జన్యం జరగాల్సిందే అని, ఫలితంగా విశ్వం ఒక యుద్ధమైదానం అని తేలింది. గతంలో ఈ విశ్వం దౌర్జన్యాలను చూచింది. కాని అప్పట్లో అది దౌర్జన్యంగానే పరిగణించబడేది. ఇప్పుడు అవి చెల్లుబడిలో ఉన్న తత్వంగ, బలంకల వారి హక్కుగ ఆమోదం పొందాయి. యూరోపియన్లు ఇతర జాతీయులపై విస్తృతంగా సాగించిన నేరాలను కప్పిపుచ్చడానికి ఈ తత్వం అనుకూలపడింది.

అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికా ప్రజలను తుడిచిపెట్టడమో లేక వారిని బానిసలుగా చేసుకోవడానికి ఈ తర్కం బాగా దోహదపడింది; ఇది ప్రకృతి సిద్ధాంతాలకు అనుగుణంగా ఉందనే వారు భావించారు. ఎవరైతే ఈ భూమి పైనుండి నామరూపాలు లేకుండా తుడిచివేయబడ్డారో వారు అందుకు తగినవారని, ఎవరినైతే తమ ఆధీనంలోకి తీసికోబడ్డారో వారు బానిసలవడానికే అర్హులని యూరోపియన్లు అన్నారు. గతంలో ఇలాంటి దురాగతాలు చేసినప్పుడు పాశ్చాత్యుల అంతరాత్మ మేల్కొలుపు కల్గించి ఉంటే, డార్విన్ తర్క సిద్ధాంతం వాదనల ద్వారా, నిరూపణల ద్వారా అలాంటి మేల్కొలుపుకు అవకాశం లేకుండా చేసింది. ఈ భావాలు సైన్సులో ఏ స్థానం ఆక్రమించుకొన్నప్పటికీ, సాంస్కృతిక, సామాజిక, రాజకీయరంగాలలో ప్రవేశం చేసి మానవులను పరస్పరం తగవులాడుకొనే తోడేళ్ళుగా చేశాయి.

(Ibid, పే: 28-30) తఫ్మాత్: రెండవ భాగం చూడండి.)

## మార్క్సు భౌతికవాద ప్రభావం

హేగల్ మరియు డార్విన్ సిద్ధాంతాలతో ఏకీభవించే జీవిత దృక్పథాన్ని మార్క్సిజం కూడా బోధించింది. హేగల్ మన ఆలోచనా ప్రపంచాన్ని యుద్ధమైదానంగా చిత్రించాడు; ప్రకృతి మరియు భౌతిక ప్రపంచం ఒక రణరంగం అని డార్విన్ వర్ణించాడు. మానవ సమాజాన్ని పై రంగులలో చిత్రించాడు మార్క్సు. ఈయన చిత్రించిన పటంలో మనిషి ప్రారంభం నుండే తగవులు తగాదాలలో ఉండడం చూస్తున్నాం. అవసరాలను తీర్చుకునేందుకు, అభిరుచులు నెరవేర్చుకొనేందుకు మనిషి స్వభావం తోటి మానవులతో తగవులాడేందుకు ప్రేరేపిస్తుంది. కేవలం స్వార్థాన్ని ఆధారం చేసికొని మానవ సమాజాన్ని ఎన్నో వర్గాల్లో విభజన చేయడం అయింది. స్వార్థం వల్లనే వివిధ తరగతుల మధ్య స్పర్థలు వైషమ్యాలు ఏర్పడ్డాయి. మానవ చరిత్ర స్వార్థంతో కూడిన వర్గ పోరాటంతోనే ఉనికిలోకి వస్తుంది. వివిధ జాతుల మధ్య విరుద్ధవైఖర్లు ఉండడమే కాదు, ఒక జాతిలోని వివిధ వర్గాలలో తగవులు పోరాటాలు ఉండడం కూడ మనం చూడవచ్చు. ఇలా జరగడం సంపూర్ణంగా సహజం అని ఈ దృశ్యం తెల్పుతూంది. ఇంకా, మానవుల మధ్య ఏదైనా సంబంధం ఉందా అంటే అది అవసరాలను తీర్చుకోనేందుకు భాగస్వాములవడమే.

ఇలాంటి సంబంధం పెట్టుకొన్న వారితో చేతులు కలపడం, ఆర్థిక దృష్ట్యా ఏకీభవించని వారితో – వాళ్ళు స్వదేశీయులు కానీయండి, స్వమతానికి చెందిన వారు కానీయండి – ఘర్షణపడడం న్యాయమే, ఇంకా ఇలాంటి చర్చలకు పూనుకోకపోవడం, వాటిలో భాగం పంచుకోకుండా పోవడం ప్రకృతి విరుద్ధమే, ఇది మార్క్సు బోధించే భౌతికవాదం. (Ibid, పే: 30–31)

## పాశ్చాత్య నైతికతకు పునాదులు

దైవాన్ని, మరణానంతర జీవితాన్ని కాదన్నాక నైతికతకు మిగిలిన మార్గం భౌతిక విలువల ద్వారా విధానాలు రూపొందించుకోవడం మాత్రమే. ఇక దానికి మూలధర్మం ప్రయోగాలే. ఎవరు ఎంతగా ప్రయత్నించినా ధర్మం

సమకూర్చిన నైతిక విలువల్ని నూతన పునాదులపై నిర్మించడం, లేక మానవ జీవితంలో దైవప్రవక్తలు నేర్పిన నైతిక సూత్రాలను పటిష్టవంతం చెయ్యడం దైవ విశ్వాసం ఆధారంగా తప్ప మరో విధంగా సాధ్యపడదు.

ఏ నైతిక తత్వమయితే మత రాహిత్యం మరియు మరణానంతర జీవితం యొక్క తిరస్కార వాతావరణంలో ఊపిరిపోసుకుందో, మరేదయితే పాశ్చాత్య జీవిత విధానంలో ఒక భాగంగా రూపొందిందో అందులో స్వార్థపరత్వం, నాస్తిక తత్వానికి చెందిన సాధారణ భౌతిక వాదం ఇమిడి ఉన్నాయి. యావత్తు పాశ్చాత్య నాగరికతకు పాశ్చాత్య జీవిత విధానాలకు పునాదులు ఈ కలగూరగంపపైనే వేయబడ్డాయి. బహుజన సౌఖ్యాన్ని గురించి, నాస్తికత్వాన్ని గురించి గ్రంథాల్లో ఉన్న శాస్త్రీయ నిర్వచనాలు ఏవయినా సరే పాశ్చాత్య నాగరికత, పాశ్చాత్య మనిషి వీటిద్వారా గ్రహించిన సారాంశమేమిటంటే "స్వయానికి" ప్రయోజనం చేకూర్చేదే విలువైంది. ఇంకా "స్వయం" అనే దాన్ని విస్తృతార్థంలో తీసుకుంటే "స్వజాతి"కి లాభం చేకూర్చేదే విలువవైంది అని తేలుతుంది. ప్రాపంచిక ప్రయోజనం - కొంత సుఖం, కొంత ఆనందం కొంత భౌతిక లాభం అన్నమాట. స్వయానికి, స్వజాతికి లాభం చేకూర్చే ఏదయినా విలువైనదే, పొందదగినదే! దాన్ని పొందడానికి ఉన్న శక్తి సామర్థ్యాలన్నీ వినియోగించవలిసిందే!! అలా కాకుండా స్వయానికి స్వజాతికి భౌతికంగా చెప్పుకోదగ్గ రీతిలో ఏ విధంగానూ ప్రయోజనకరం కాని దానికై ఎలాంటి ప్రయత్నమయిన చెయ్యడం నిరర్ధకమే! దీనికి భిన్నంగా ప్రాపంచికంగా నష్టం కలిగించేదిగా ప్రయోజనానికి, ఆనందానికి దూరం చేసేదే అసలు "చెడు" నిజమైన "అపరాధం." దాన్ని త్యజించడం తప్పనిసరి! (Ibid, పే: 31-33)

## పాశ్చాత్యుల ప్రాబల్యం

పాశ్చాత్యులు తమ చట్టాలను మనపై రుద్దారు. వాటి ద్వారా మన సామాజిక, సాంస్కృతిక విధానాన్ని తారుమారు చేయడమే కాక, మన సామాజిక దృక్పథాలను, న్యాయ భావనలనే పూర్తిగా మార్చేశారు.

బ్రిటిష ప్రభుత్వం వారు మన దేశంలో అమలులో ఉన్న షరీఅత్ చట్టాలను తొలగించి, వారి చట్టాలను జారీ చేస్తారంటే దానికి అర్థం : కేవలం ఒక చట్టం పోయి మరో చట్టం వచ్చిందని కాదు, ఒకానొక నైతిక సాంస్కృతిక విధానాన్ని రూపుమాపి, వేరొక నైతిక, సామాజిక విధానానికి నాందీ ప్రస్తావన జరిగిందన్న మాట. ఈ మార్పును పటిష్ఠపరచేందుకు వారు తమ న్యాయశాస్త్ర విద్యను, "లా కాలేజీ"లలో ప్రవేశపెట్టారు. ఈ విద్యా విధానం విద్యార్థులలో వెనుకటి న్యాయ శాస్త్రాలు, చట్టాలు పురాతనమయినవి, అనాగరికమైనవి, నవనాగరిక ప్రపంచానికి ఏ మాత్రం సరిపొయ్యేవి కావనే భావాన్ని కల్గిస్తూ, పాశ్చాత్యుల ఈ క్రొత్త న్యాయ విధానం, దాని సిద్ధాంతాలు, సూత్రాల సమేతంగా ఆధునికమైంది, సవ్యమయింది, అభివృద్ధి పథంలో నడిపించేది అనే నమ్మకాన్ని కూడా వారి మనసుల్లో నాటుకునేలా చేసింది. ఈ చట్టాల ప్రభావాన్ని కాస్త అంచనా కట్టడానికి, వారు, వ్యభిచారాన్ని, మానభంగాన్ని, జూదాన్ని, మద్యపానాన్ని, ఇంకా అక్రమ వాప్యార వ్యవహారాలను చట్టబద్ధం చేయడాన్ని గమనిస్తే తెలుస్తుంది. ఇలాంటి చట్టాల మద్దత్తుతో వీటి అండదండలతో అనేక విధాల పాప కార్యాలు అవినీతి చర్యలు ప్రబలిపోయాయి. ఇంకా చట్టం ఇచ్చే ప్రోత్సాహం లేనందువల్ల అనాగరిక కాలంలో సయితం వృద్ధిలో ఉన్న మంచిపనులు నామరూపాల్లేకుండా సమసిపొయ్యాయి. (Ibid, పే: 37-39)

## పాశ్చాత్యుల ప్రభావం

## సాంస్కృతిక, సామాజిక రంగాలు

ఆంగ్లేయులు తమ నీచమైన పద్ధతుల్ని, జీవిత విధానాన్ని మనపై రుద్దడమేకాదు, ఆ పద్ధతుల్ని పాటించి వారి స్వరూప స్వభావాలతో రూపుదిద్దుకున్న వారినే వారు తమకు చేరువచేసుకొన్నారు. సమాజంలో వారికి ప్రాముఖ్యతనిస్తూ వచ్చారు. ఇలాంటి వారికే అదృష్టం వరించింది. సమాజంలో ఆధిక్యతకు, భౌతిక పురోగతికి ఇదే గ్యారంటీ మార్గంగా మారింది. అందుచేతనే ఉన్నత వర్గాల వారు ఇంకా, రానురాను మధ్యతరగతి వారు కూడా ఆంగ్లేయుల మూసలో పోత పోసుకుంటూ పోయారు. ఫొటోగ్రఫీ, సినిమా, రేడియో ఇంకా,

పెద్ద మనుష్యులుగా చెలామణి అయ్యేవారి నగ్నత్వం, అశ్లీలం బాగా ప్రచారంలోకి వచ్చాయి. ఫలితంగా ఒక శతాబ్దంలోనే మనం అధోగతి పాలయ్యాం. 'కో ఎడ్యుకేషన్' విస్తృతమైపోయింది; ఘరానా స్త్రీలు మధువు సేవిస్తూ నగ్న నాట్య ప్రదర్శనలు జరుపసాగారు; సంస్కారవంతుల సంతానం సినిమాల్లో చేరి 'నటులు'గా మారి పడుపు కన్యలు కూడా సిగ్గుపడే నగ్నత్వం ప్రదర్శించసాగారు; ప్రజలు తమ కూతుళ్ళను, చెల్లెండ్రను, ఇలాంటి నగ్న ప్రదర్శనలలో చూస్తూ వారిని అభినందించే పరిస్థితి వరకు సమాజం దిగజారిపోయింది.

పాశ్చాత్య దేశాల్లో మాదిరిగా పెండ్లికాని తల్లులు, తండ్రి తెలియని బిడ్డలు సమాజంలో ఉన్నంత మాత్రాన చెడిపోయిందేమిటి? వివాహిత స్త్రీలకు, సమానంగా, శాస్త్రోక్తంగా పెండ్లయ్యాక కలిగిన సంతానానికి సమానంగా వీరిని ఎందుకు గౌరవించరాదు? అని ఎదురు ప్రశ్న వేసే ప్రబుద్ధులు పుట్టే రోజులు కూడా దగ్గరవుతూ వచ్చాయి. ఇలాంటి పరిణామాన్ని పాశ్చాత్యులు ఒక రోజులో సాధించలేదు. మార్పుకు అవసరమైన దశలన్నింటినీ దాటుకుంటూనే వచ్చారు.

(Ibid, పే: 39-40)

# పాశ్చత్యుల ప్రాబల్యం - ముస్లింల ప్రతిస్పందన

## అంధానుసరణం

బలం ఉండి, అభివృద్ధి నినాదాలనిస్తూ మమ్మల్ని ఏలుతున్న జాతి ఏ ప్రభావాన్ని సమాజంలో స్థాపించగలిగిందో దాన్నే అంగీకరిద్దాం అంటూ ఒక వర్గం నిర్ణయించుకొంది. వారిచ్చే విద్య నేర్చుకుందాం, వారు పాటించే ఆర్థిక విధానాలనే అంగీకరిద్దాం, వారు అమలుపరచే శాసనాంగాలనే అనుసరిద్దాం, వారి సామాజికరంగులో మనం కూడా అద్దకమై పోదాం, ఏ రాజకీయ సిద్ధాంతాలు వారు నిర్మిస్తున్నారో వాటికే అంకితమై పోదాం అంటూ ఈ ముస్లిముల వర్గం ముందుకొచ్చింది.

ఆధునిక విద్యా విధానాన్ని అనుసరిస్తూ చదువుకున్న కొందరు ముస్లింలు మతం పట్ల పాశ్చాత్యులకున్న దృక్పథాన్ని పూర్తిగా అంగీకరించారు. మతం పట్ల పాశ్చాత్యులకున్న భావాలు క్రైస్తవ మతం, మరియు ఆ మతగురువులు

బోధించే విధానాలపై ఆధారపడి ఉన్నాయి, ఇస్లాంకు అందు ప్రమేయమే లేదన్న విషయాన్ని వారు అర్థంచేసుకోలేదు. విమర్శనా జ్ఞానాన్ని కోల్పోయిన ఈ ముస్లింలు పాశ్చాత్యుల బృందగానానికి వంతపాడడం ప్రారంభించారు. మతం వ్యక్తి వరకే పరిమితం అని పాశ్చాత్యులు అంటే వీరూ సరే అన్నారు. మతం అనేది ఒక ప్రయివేటు విషయం, సామాజిక జీవనంతో దీనికెలాంటి సంబంధం లేదని ముక్తకంఠంతో అన్నారు.

ఈ భావం ముస్లింల మనస్సుల్లో బాగా నాటుకొనిపోయింది. ఫలితంగా ఈనాటికి "ఇస్లాం ఒక సంపూర్ణ జీవిత విధానం" అని ఎవరైనా ఆలోచించకుండా చెప్పేవారుంటే, వారు తమ చేతలతో ఇస్లాం కేవలం ప్రయివేటు విషయం అనే సిద్ధాంతాన్నే సార్థకపరుస్తూ ప్రవర్తిస్తుంటారు. పబ్లిక్ రంగాలలో మతానికి ప్రాధాన్యమివ్వడానికి అలాంటివారు అవకాశం ఇవ్వరు. ఇంకా చెప్పాలంటే ఇలాంటి వాళ్ళలో చాలా మంది చెప్పుకోవడానికి ముస్లింలు. వారి జీవితాలలో ఇస్లాం మచ్చుకు కూడా కనబడదు. పెండ్లిండ్లు, ఖత్నాలు చేసుకోవడంలో ఇస్లామీయ సాంప్రదాయాల్ని పాటించడం తప్ప సంపూర్ణ ఇస్లామీయ సిద్ధాంతాలకు చాలా దూరం ఉంటూ వచ్చారు. ఇలాంటి వారు ఇంకా ఏం చేయడానికి ప్రయత్నించారంటే పాశ్చాత్యుల్ని, వారి సిద్ధాంతాల్ని, విధానాల్ని సరైనవిగ భావిస్తూ, అవే సత్యమంటూ విశ్వసిస్తూ, ఇస్లాం బోధించే విశ్వాసాలను, జీవిత విధానాన్ని, చరిత్రను వాటికనుగుణంగా ఉండేటట్లు మలచడం మొదలెట్టారు. అలా మలచడానికి సాధ్యమైనవన్నీ ఇస్లాం నుండి గ్రహించి పాశ్చాత్యుల జీవనప్రవంతిలో మిళితం చేశారు; ఏదైనా అలా చేయడానికి సాధ్యం కాకపోతే దాన్ని తుడిచిపారెయ్యడానికి ప్రయత్నం చేశారు. దాని పట్ల సిగ్గుపడుతూ ప్రపంచం ఎదుట క్షమాపణకోరుకొంటూ వచ్చారు. (Ibid, పే:43)

## స్తంభన, మొండి వైఖరి

మరో వర్గం మొదటి వర్గానికి వ్యతిరేకంగ కూడా ఉంది. ఈ వర్గం ప్రతిస్పందించింది. మొదటి వర్గం పాశ్చాత్య ప్రభావంలో పడికొట్టుకు పోతూంటే రెండవ వర్గం వారి ప్రభావాన్ని వ్యతిరేకిస్తూ కఠిన శిలలా నిలిచింది. 18 వ

శతాబ్దం నుండి, 19వ శతాబ్దానికి వారసత్వంలో వచ్చిన వైజ్ఞానిక, మత, నైతిక, సామాజిక ప్రమాదాల్ని, సాంప్రదాయాల్ని, అందులోని మంచి చెడులతోపాటు ఈ వర్గం తప్పకుండ పాటించడమే తమ ధ్యేయం అని నిశ్చయించింది. క్రొత్త సంస్కృతిని, విజయభేరి మోగిస్తున్న పాశ్చాత్య విధానాన్ని తిరస్కరించడం ఈ వర్గ లక్ష్యం. నూతన విధానాల అధ్యయనం చేయడం వృధాకాలవ్యయం అని వీరు తలంచారు, పాతపద్ధతుల్ని విడువకుండా ఉండడానికి వీరవలంబించిన వైఖరి, పాశ్చాత్య సంస్కృతిని వ్యతిరేకించిన మొదటి దినం నుండి ఏలాంటి మార్పులు లేకుండ ఈనాటి వరకు వాటినే పాటించడం మనం చూడవచ్చు. పాతకాలం నుండి వస్తున్న సంస్కృతిలోని మంచి చెడులను పరిశీలించి ఏ విషయాల్ని పరిత్యజించాలి. ఏ విషయాల్ని భద్రపరుచుకోవాలి అని ఆలోచించేందుకు కూడ ఈ వర్గీయుల వద్ద తగిన సమయంలేదు. ఇంకా క్రొత్తగ అవతరించిన ఈ పాశ్చాత్య సంస్క ృతిలో స్వీకరించేందుకు ఏ విషయాలున్నాయ్, పరిత్యజించేందుకు ఏ విషయాలున్నాయి అని చూడాలన్న ఆలోచన కూడ వీరికి రావడంలేదు. (Ibid, పేజ్: 51-52)

## ముస్లింల ప్రతీకార చర్య

1. పాశ్చాత్యుల ప్రభావం విపరీతంగా ప్రబలిపోయే సమయంలో ముస్లింలు ఆలోచనా రహితులై జీవచ్ఛవాలుగా తయారవడం వల్ల కలిగిన చెడు ఫలితాలలో ప్రథమంగా పేర్కొనదగినది ఏమంటే ఏ లోపాలను మనం మన ధర్మంలో చేర్చుకున్నామో వాటిని కూడా మన విశ్వాసంతోపాటు రక్షించుకోసాగాము.

ఈ విధంగా వారసత్వంతో వచ్చిన లోపాలు, చెడులు ఇస్లామీయ ఉద్యమానికి అడ్డు రాసాగాయి. పాశ్చాత్య విధానాన్ని పాటించేవారు సృష్టించే అవరోధాలకంటే ఇవి తక్కువైనవి కావు.

2. ముస్లిముల ఈ వైఖరి విపరీతంగా నష్టదాయకంగా పరిణమించింది. మన విశ్వాసాన్ని, నైతిక, సాంస్కృతిక ప్రత్యేకతల్ని క్రమంగా క్షీణ దశకు తోడుకు పోవడానికే మద్దతునిచ్చింది.

వెల్లువలా, కుంభ వర్షంలా విరుచుకుపడుతున్న పాశ్చాత్య నాగరికతలో కొట్టుకుపోతున్న ఇస్లామీయ సంస్కృతికి తగినట్లు ఆదుకునే వారే కరువయ్యారు. "పాతకాలపు" పద్ధతితో పాటు ఎన్నో తప్పుడు విధానాల్ని మనం అనుసరిస్తూ కాపాడుకొంటూ వచ్చాం. వాస్తవానికి కాపాడుకోవడానికి అవి యోగ్యమైనవి కావు. ఇస్లాం ప్రతిష్ఠకు అవి భంగం కలిగించేవే. ముఖ్యంగా ఇస్లామీయ సంస్కృతికి శత్రువయి వచ్చిన పాశ్చాత్య విధానాన్ని ఎదుర్కొనడానికి ఆ విధానాలు పనికి వచ్చేవి కావు. ఫలితంగా గత 60 సంవత్సరాల నుండి ఇస్లాం మరియు ఇస్లామీయ సంస్కృతి పురోగమించలేకపోయింది. నిరంతరం పతనానికి గురి అవుతూ వచ్చింది. ప్రతిదినం మన విశ్వాసం, నైతికత, సంస్కృతి తమ మైదానాల నుండి పరుగులు తీస్తుంటే మన జీవితాలు పాశ్చాత్యుల పైశాచిక విధానాలకు నీచపనులకూ, అసహ్యమైన మనోవాంఛలను తీర్చుకునే అక్రమ అలవాట్లకు గురిఅవుతూ వచ్చాయి. 'పాతపద్ధతులను' కాపాడుకోవాలని ముందుకొచ్చిన వారు ఈ పరిణామ వేగాన్ని ఒక్క నిముషమైనా ఆపలేకపోయ్యారు.

## ముస్లింల వైఖరివల్ల కల్గిన నష్టం

పాశ్చాత్య నాగరికత అతివేగంగా వ్యాప్తిలోకి వచ్చింది. ప్రజల్ని ఆకర్షించింది. ముస్లింలు జీవచ్ఛవాలుగా జీవించసాగారు. ఇస్లాం మరియు ఇస్లామేతర సిద్ధాంతాలను మిళితం చేనికొని ఆ మిశ్రమ సంప్రదాయాన్ని కాపాడుకోవడానికి ప్రయత్నం చేశారు. కాని క్రమేణ ధర్మనిష్ఠాపరులు ఈ మిశ్రమ సంప్రదాయాల పట్ల ప్రజలలో ఆసక్తి, ఆకర్షణ కల్గించ లేకపోయారు. వీరి ఆలోచనలలో ఆచరణలో ఆకర్షణీయమైన వస్తువే లేకుండా పోయింది. ధనవంతులు, చదువుకొన్నవారు ఇస్లాం సంప్రదాయాలకు దూరమౌతూ వచ్చారు. మతం పట్ల సామాన్యులు నిర్లక్ష్యవైఖరి అవలంబించారు. ఈ అవకాశాన్ని వినియోగించుకొంటూ ఇస్లాంకు శత్రువైన పాశ్చాత్యనాగరికత పరవళ్ళు త్రొక్కుతూ ముందుకు పోసాగింది. భౌతిక ప్రగతికి మెట్లేసింది. ప్రజల మనస్సుల్ని ఆకర్షించింది. కన్నులు మిరిమిట్లు గొలిపే దృశ్యాల్ని చూపించింది. ఇస్లాంను

సమర్థించేవారు వాగ్వివాదాలకు దిగారు. మొండి వైఖరి అవలంబించారు. విమర్శల్లో రంధ్రాన్వేషణకు అలవాటుపడ్డారు. ప్రజలను ఆకర్షించేందుకు, వారి కన్నుల్ని మిరుమిట్లుగొలిపే దృశ్యాలు చూపించేందుకు వీరి వద్ద ఏమీ లేకపోయింది. ప్రాపంచిక వసతులున్నవారు, విద్యావంతులు మతంపట్ల తమకున్న అభిమానాన్ని కోల్పోయారు. పాశ్చాత్య నాగరికతా ప్రభావానికి దాసులయ్యారు. వారసత్వంలో వస్తున్న ఇస్లాం సంరక్షణ భారం ఆర్థికంగా, వైజ్ఞానికంగా, సామాజికంగ వెనుకబడ్డ ముస్లింలపైబడింది.

పాశ్చాత్యుల ప్రభావం విస్తరించినకొద్ది సిసలయిన ఇస్లాం అనుచరులు ముస్లింల నాయకత్వంనుండి తొలగింపబడ్డారు. అన్నిటికంటే ఈ పరిణామమే ఎక్కువగ ముస్లింలను నష్టపరిచింది. విద్య, సాంస్కృతిక, సామాజిక, రాజకీయ తదితర రంగాలలో ముస్లింలకు మార్గం చూపి వారి నాయకత్వభారం వహించే బాధ్యత ఇస్లాం ధర్మ జ్ఞానం ఏమాత్రం లేనివారు తీసుకున్నారు. ఆ ఘనులకక్కడ ఇస్లాంపట్ల విశ్వాసంవల్ల తారసిల్లే బాధ్యతల్ని, తెలిసినవారి ద్వారా అర్థం చేసుకుందాం అనే ధ్యాసేలేదు. వారు పాశ్చాత్య విద్యావిధానంలో చదువుకొన్నారు. వారి సామాజిక జీవిత విధానం పాశ్చాత్య ప్రభావానికి లోనై ఆ అచ్చులోనే పోతపోసుకుంది. వారి నైతికత, పాశ్చాత్య సిద్ధాంతాలపై, వాటి విలువలపై ఆధారపడి నిర్మాణమైంది. షరియత్ చట్టాల్ని పాశ్చాత్యుల న్యాయశాస్త్ర కళాశాలలు ఏ రీతిలో వారికి బోధించాయో ఆ రీతిలోనే వారు వాటిపై అమలు జరపసాగారు. వారి వేషభాషల్లో, రాజకీయ వైఖరిలో ఇంకా ఇతర నియమాల్లో పాశ్చాత్య వైఖరి ఉట్టిపడుతూ వచ్చింది. అలాంటి వారే ముందుకు వచ్చారు. తాము ఏ అక్రమ పద్ధతుల్ని అలవర్చుకొంటూ వచ్చారో, ఆ పద్ధతుల వెలుగులోనే యావత్తు సమాజ జీవనాన్ని మలచసాగారు. ప్రజలంతా వారిపై నిండు విశ్వాసాన్ని ప్రకటించారు. ఈ వ్యవహారం ఇలా సాగిపోతూంటే ధర్మనిష్ఠాపరులు జనజీవనానికి దూరమవుతూపొయ్యారు. ఆధ్యాత్మిక చింతనలోమునిగి ఎప్పుడూ దైవనామ సంస్మరణలో, ఆరాధన, ఉపాసనల్లోనే లీనమయ్యారు. జపమాలలు

పట్టుకొని లెక్కించుకుంటూ కూర్చోవడం తప్ప మరేపని ధార్మికమయిందిగా వారికి గోచరించలేదు. ఇలాంటి వారు ఎప్పుడైనా రాజకీయ మైదానంలో వచ్చినా అదీ, కేవలం మరొకరి పాటకు వంత పాడే వారిలా అగుపించేవారు.

(Ibid, పే: 54-57)

## పాశ్చాత్యుల ప్రభావం

కమ్యూనిజం అనేది క్రొత్తగా పుట్టిన సిద్ధాంతం కాదు. ఇది కూడా పాశ్చాత్య నాగరికత కొమ్మపై పుట్టిన ఒక రెమ్మ. అసలు యూరపులో జరిగినదేమిటంటే పాశ్చాత్యులు చర్చికి వ్యతిరేకంగా తిరగబడ్డారు. దైవాన్ని, దైవప్రవక్తల్ని నిరాకరించారు, ఇష్టానుసారం జీవన సమస్యల్ని పరిష్కరించుకునేందుకు మార్గాన్వేషణ చేయనారంభించారు. ఇలా కొన్ని శతాబ్దాలు గడిచాయి. మత ప్రమేయంలేని లౌకిక నాగరికత వ్యాప్తిలోకి వచ్చింది. ఈ నాగరికత ఎన్నో ఘోరమైన సమస్యల్ని తెచ్చి పెట్టింది. సమాజంలో ప్రాణాలకు ముప్పు తెచ్చే తగాదాలు ప్రబలిపొయ్యాయి. లోతుగా ఆలోచించలేని పాశ్చాత్యులు తమలో ఏవో కొన్ని భిన్నాభిప్రాయాలు మాత్రమున్నాయని తలంచారు. అసలు, క్యాపిటలిజం, ఫాసిజమ్, కమ్యునిజం మొదలగు వాటి మధ్య ఉన్న మౌలిక విభేదాలకు ప్రాముఖ్యత ఇవ్వలేదు. వారందరిలో ఒకే సాంస్కృతిక సిద్ధాంతం మౌలికమయింది. అదే: “దేవుడున్నాడా? లేడా? అనే ప్రశ్న అటుంచి, వాస్తవానికి మనిషి, దైవంపట్ల (ఇష్టంగాకాని, అయిష్టంగా గాని) కనబరచే విధేయత అవసరం లేదు. దైవహితోపదేశాల అవసరం కూడా మనిషికి లేదు. చేసిన పనులకు, ఆయన సమక్షంలో సంజాయిషి చెప్పుకోవలసిన బాధ్యత కూడా మానవునిపై లేదు. మానవుడు భూమిపై చేసిన మంచి పనులకు ప్రతిఫలం పొందడానికి మరణానంతర జీవితమంటూ ఏదీలేదు.” అని వారంతా విశ్వసించారు. మనిషికి సంపూర్ణ స్వేచ్ఛ ఉంది. తెలివితేటలను ఉపయోగించి అనుభవాన్ని బట్టి, అవసరాలను బట్టి తన జీవన మార్గాన్ని స్వయంగా నిర్ణయించుకోగలడు. జీవిత ధ్యేయం- ఇహలోకంలో సుఖభోగాలు అనుభవించడమే; అని వారు నిర్ణయించుకున్నారు. (చిరాగే రాహ్ 12/67 పత్రిక ప్రత్యేక సంచిక, పే: 480)

## పెట్టుబడిదారీ విధానం

ఇస్లామీయ ఆర్థిక విధానం బోధించే సిద్ధాంతాలు, సూత్రాలకు, పెట్టుబడిదారీ ఆర్థిక విధానాలకు ఎలాంటి సంబంధంలేదు. ఈ రెండు విధానాలు వాటి లక్ష్యాలలో, ఉద్దేశ్యాలలో, ఆచరణా విధానంలో పరస్పరం భిన్నధృవాలు. ఇస్లాం చూపే ఆర్థిక పంథావేరు. పెట్టుబడీదారీ విధానం చూపే మార్గంవేరు. పెట్టుబడిదారీ విధానం తెలియజేసే సిద్ధాంతాల్ని, సూత్రాల్ని ఆమోదిస్తూ, ఆర్థికచట్టాలలో ఏ ఒక్క దానిలోనైనాసరే, ఇస్లాం ప్రతిపాదించే నిబంధనల్ని పెట్టి పరిశీలించినట్లయితే అవి ఏ విధంగానూ ఇమడవు అని తెలుసుకోవడానికి ఎంతో కాలం పట్టదు. లేకపోతే వాటి సమన్వయానికి చేసే ప్రయత్నం అసలు ఇస్లాం నిబంధనలలో వివరణలు చేసి వాటిని మళ్ళీ పెట్టుబడిదారీ విధానపు రంగు పులమడానికి చేసే ప్రయత్నమే అవుతుంది. అలాంటప్పుడు ఆ నిబంధనలలోని ఇస్లామియ జీవితం అణగారిపోతుంది, ఇస్లామియ చట్టాలు ఏ లక్ష్యాలను, ఏ ఉద్దేశాలను సాధించాలని నిర్మించబడ్డాయో వాటిని పొందలేము కూడా. పర్యవసానంగా ఆ ఆర్థిక నింబంధనల్ని ఇస్లాం నిబంధనలు అనడం సాధ్యపడదు - ఎందుకంటే అవి కావు గనక! (సూద్: 27-7-1947)

సూక్ష్మంగా చెప్పాలంటే పెట్టుబడిదారీ విధానంలో సంపాదించే వ్యక్తి తన సంపాదనకు సంపూర్ణ హక్కుదారుడౌతాడు. తన సంపాదనలో ఇతరులెవ్వరికీ హక్కు ఉండదు. సంపాదించిన ధనాన్ని ఇష్టానుసారం ఖర్చుచేసే అధికారం అతనికి ఉంటుంది. వ్యయం చేయడంలో స్వలాభం లేకుంటే ఆ ధనాన్ని నిలిపివేసే హక్కు కూడా అతనికి ఉంటుంది. ఈ విధానం మనిషిలో సహజంగా వుండే స్వార్థంతో ప్రారంభమై, అపరిమితమైన స్వార్థానికి దారితీస్తుంది, సమాజాభివృద్ధికి మనిషిలో ఉండాల్సిన సుగుణాల్ని అణచి వేస్తుంది. నైతిక దృక్పథంతో కాకుండా కేవలం ఆర్థిక దృక్పథంతో పరిశీలిస్తే ఈ మనస్తత్వం ఆర్థిక అసమానత్వాన్ని సృష్టిస్తుంది, ఏ కొందరో అదృష్ట వశాత్తు వనరుల్ని అనుభవిస్తారు. తత్ఫలితంగా సమాజంలో రెండు వర్గాలు ఏర్పడుతాయి. ఒక వర్గం కలిమి ననుభవిస్తుంది. మరోవర్గం లేమిని అనుభవిస్తుంది. కలిమి కలవారు వనరులపై అధికారం

కల్గి స్వలాభాపేక్షవల్ల, తమ ఆర్థిక బలాన్ని మరింత పటిష్ట పరచుకోవడానికి సమాజ శ్రేయాన్ని కాలదన్ని తమ ఇష్టానుసారం ప్రవర్తిస్తారు.

లేమిని అనుభవించే వారి సంగతి చెప్పనవసరం లేదు. ఇతరులకు ఇవ్వడానికి వారివద్ద ఏమీలేదు. పెట్టుబడిదారుల అవసరాలు తీర్చడమే వారిపని. ఈ పనిలో వారు జీవితాంతం శ్రమించాల్సిందే; పొట్టకూటికి రేయింబవళ్ళు కష్టపడాల్సిందే. ఇలాంటి ఆర్థిక విధానం వల్ల సమాజంలో ఒకవైపు వడ్డీ వ్యాపారస్తులు, కర్మాగారాల యజమానులు, భూస్వాములు అధికమవుతే మరోవైపు కర్షకులు, కార్మికులు, ఋణగ్రస్తులు ఎక్కువౌతారు. పరస్పర సహకారం, సానుభూతికి ఈ విధానంలో స్థానంలేదు. అలాంటి భావన ఎవరి హృదయాల్లోనూ అంకురించదు. ప్రతివ్యక్తి తన సొంతరాబడిపై జీవించాల్సిందే. అవసరం వస్తే ఆదుకొనేవారు సహాయం చేసేవారు ఎవరూ ఉండరు. సంపాదించే స్తోమత లేని వారికి అన్ని ద్వారాలు మూయబడతాయి. సమాజంలోని ప్రతివ్యక్తి తన జీవితావసరాలను తీర్చుకునేందుకు ఇతరులతో పోటీపడతాడు. అక్రమ విధానాలకు పాల్పడుతాడు. రాబడినిచ్చే వనరుల్ని స్వాధీన పరుచుకోవడానికి ప్రతివ్యక్తి ప్రాణాలొడ్డి ప్రయత్నిస్తాడు. స్వార్థ సాధన ప్రతి ఒక్కరి ధ్యేయమవుతుంది. రోజుకురోజు తన పెట్టుబడిని అధికం చేసుకోవాలనే తపన పెరుగుతుంది. ఈ కృషిలో విఫలమై, తన అవసరాలను తీర్చుకోలేని వ్యక్తి నిస్సహాయుడై, దౌర్భాగ్యపు బ్రతుకు గడపవలసి వస్తుంది. అలాంటి మనిషి చేజాచి బిక్షమెత్తడం కూడా సాధ్యంకాదు. తోటిసోదరుల కనికరానికి సహాయానికి నోచుకొని వ్యక్తి జీవితం దుర్భరం అవుతుంది. చివరికి ఆ వ్యక్తి ఉరిపోసుకొని చావడమో, లేక పొట్టకూటి కోసం అన్యాయానికి, అవినీతికి పాల్పడి నేరాలు చేయడమో తప్పనిసరవుతుంది.

(సూద్– పేజ్: 9–10)

పెట్టుబడిదారీ విధానం ఆధారంగా పుట్టి పెరిగిన సమాజంలో దయ, కనికరం, సహకారం లాంటి సుగుణాలకు స్థానం లేకుండా పోయింది. పై పెచ్చు సమాజం చెడు గుణాలకు ఆలవాలమయింది. పరాయి వారి ప్రవర్తన

ఎలా ఉన్నా సొంత సోదరులు కూడా పరస్పర సహాయ సహకారాలు నోచుకోలేదు. ఒక వైపు కర్మాగారాలు స్థాపించబడడంవల్ల ఉన్నట్టుండి వేలాది సంఖ్యలో ప్రజలు నిరుద్యోగులయ్యారు, సంపాదనా శక్తిని కోల్పోయారు. మరోవైపు, నిరుద్యోగులకు పని కల్పిద్దాం, పని చేసే స్తోమత లేని వారికి ఆర్థిక సహాయం అందిద్దాం అనే తలంపు ప్రభుత్వానికి, సమాజానికి, కర్మాగారాల యజమానులకు, బ్యాంకులు నడిపే బడా వ్యాపారులకు కలుగలేదు. ఇబ్బందులకు లోనైన వారు అధిక సంపాదన కలిగి, ఆ సంపాదనలో కొద్దో గొప్పో పొదుపు చేసుకోగలిగితే వారి సమస్యల్ని పరిష్కరించేందుకు వారు, ప్రమాదాలకు గురయినా వ్యాధిగ్రస్తులయినా ఇంకా అసాధారణ కారణాల వల్ల కష్టాలకు గురయినా పని చేసే కాలంలో వారు పొదుపు చేసుకొన్న దానికి కొంత కలిపి ధన సహాయం చేయడం జరిగేది. అసలు ఆదాయం లేని వారు, ఆదాయం ఉన్నా ఏ పూటకు ఆ పూట గడుపుకొనే వారు ఏదైనా ఆపదలో పడి అలమటిస్తూ వుంటే వారిని చేరదీసే వారు ఎవరూ లేకపొయ్యారు. అయితే అలాంటి బాధాగ్రస్తులకు ఈ నూతన పెట్టుబడిదారీ విధానంలో మరో ద్వారం తెరువబడింది. అలాంటి వ్యక్తి వడ్డీ వ్యాపారస్తుని వద్దకు వెళ్ళి ఇంటిలోని బట్టలు, పాత్రలు సతీమణి ఒంటిపై ఉన్న ఏవో కొన్ని గురిగింజల బంగారాన్ని కుదువబెట్టి సంవత్సరానికి 300 శాతం వడ్డీ రేటుతో అప్పు తీసుకోవడం! ఇంకా, చేసిన అప్పును వడ్డీతో సహా తీర్చడానికి మరో అప్పు చేయడం!! (ఇస్లాం ఔర్ జదీద్ మాషి నజ్రియాత్, పే: 40-41)

## కొత్త సీసాలో పాత సరుకు

సవరణలు, సంస్కరణలతో క్రొత్త రూపం ధరించిన పెట్టుబడిదారీ విధానంలో పాత కంపు అలాగే ఉంది. నిరుద్యోగ సమస్య నిర్మూలింపబడక పోయింది. ఈ సమస్య యుద్ధ సమయాల్లో కూడా పెట్టుబడిదారీ విధానపు సమాజంలో పెనుభూతంలా ఉంటూ వచ్చింది.

పరిశ్రమలు, ఉత్పత్తి మెండుగా ఉన్న అమెరికాలో కూడా రెండో ప్రపంచ యుద్ధ జ్వాలలు అణగారే సమయంలో 3,200,000 మంది నిరుద్యోగులయ్యారు. ఏప్రిల్-మే 1949 లోగా ఈ సంఖ్య 3,500,000

పెరిగింది. మరో నెలలో 4 మిలియన్ల వరకు హెచ్చు అయింది. ఉత్పత్తిలో హెచ్చుతగ్గుల మార్పులతో సంబంధం లేకుండా నిరుద్యోగమనేది పెట్టుబడిదారీ సమాజంలో ఓ తప్పనిసరి సమస్య. లెక్కలేనంతటి జనాభా జీవితావసరాలను తీర్చుకోలేక మ్రగ్గడం. విస్తృత ఉత్పత్తి కోసం ప్రకృతి వనరులు ఉన్నా వాటిని వినియోగించక పోవటం, పనులు లేక అతి కష్టాలకు గురైన కార్మికులను వినిమోగించక పోవడం ఇలాంటి సమాజంలో ఒక అర్థంకాని సమస్యగా ఎప్పుడూ ఉంటుంది. పై పెచ్చు పెట్టుబడిదారీ విధానంలో అవసరాలకు చాలనంతటి స్వల్పంగా ఉత్పత్తిని చేయడం, దానికి కూడా ప్రజలకు అందుబాటులో లేనంతటి ధరలనిచ్చి కొనుగోలు లేకుండా ఆపుకోవడం సామాన్యంగా జరుగుతూ ఉంటుంది. ఫలితంగా, కనిష్ట పరిమితిలో కూడా వస్తువులు అమ్ముడుబోని పరిస్థితులలో, ఉత్పత్తిని పెంచడానికి ఎక్కువ కార్మికులను పెట్టడానికి, ప్రకృతి వనరుల్ని ఉపయోగించడానికి ముందుకు రారు. నిరుద్యోగ సమస్యతో కొట్టు మిట్టాడుతున్న ప్రజలు కొనుగోలు శక్తి లేక లేమి భారాన్ని మోయాల్సిందే.

అంతే కాదు, మరో విపరీత సమస్య ఉంది. ప్రతి ఏటా ఉత్పత్తి అయిన సరకులు, తిండి గింజలు, పండ్లు, ఇంకితర ఆహార వస్తువులు బజారు ముఖం చూడకుండానే కావాలనే ధ్వంసం చేయబడుతున్నాయి. వాటిని వినియోగించేందుకు మిలియన్ల సంఖ్యలో ప్రజలున్నారు. కాని పెట్టుబడిదారుల మనస్తత్వం అలాంటిది. కోటాను కోట్ల ధనం వెచ్చించి ప్రజా బాహుళ్యానికి తోడ్పడే వస్తువుల్ని ధ్వంసం చేయటం వారికి నచ్చుతుంది; వాటిని బజారులోకి తెచ్చి ధరల్ని తగ్గిద్దాం, అవసరమున్న ప్రజలకు తక్కువ ధరలకి అందిద్దాం అనే భావన వారి మస్తిష్కంలో రానే రాదు.

పెట్టుబడిదారీ విధానంలో ఎన్నో రుగ్మతలున్నాయి. సమాజంలో నిరుద్యోగులున్నారు. పని చేద్దామంటే వీరికీ అవకాశం దొరకడంలేదు. మరి కొందరు తగిన అర్హతలు లేక తహ తహ లాడుతున్నారు. వికలాంగులవడం వల్లనో మరో కారణంవల్లనో తాత్కాలికంగానో శాశ్వితంగానో పని చేసే స్తోమత

కోల్పోయినవారున్నారు. వీరికి సహాయం చెయ్యాలి, మద్దతు నివ్వాలి, అనే బాధ్యతను గుర్తించని ప్రభుత్వం ఓ వైపు, ధనంకల పెత్తందార్లు మరో వైపు ఉన్నారు. ఇలాంటి దేశాలలో చికిత్సను పొందాలంటే రోగి జేబులో డబ్బుండాల్సిందే. అనాథ బాలునికి విద్యాబుద్ధులు గరిపించాలంటే తండ్రి చేసివెళ్ళిన ఇన్సూరెన్సు డబ్బు రావలసిందే. గడ్డు కాలంలో వచ్చిపడే కడగండ్ల నుండి బ్రతికి బయట పడాలంటే సంపాదనా సమయాల్లో పొదుపు చేసుకున్న ధనం పై ఆధారపడాల్సిందే. పెట్టుబడిదారీ విధానమున్న దేశాలలో బాధితులు, నిస్సహాయులు మరియు అవసరాలు తీర్చుకోలేని వారిపట్ల సహాయ సానుభూతులు చూపించే నాథులు లేక కృశించి పోవడం తరచూ చూస్తూనే ఉంటాం. అదృష్టవశాత్తు ఆపద్బాంధవులు ఎక్కడయినా అగుపించారంటే అది దేశంలోని అలవాటుకు అతీతమైన దృష్టాంతంగానే పరిగణించబడుతుంది.

పెట్టుబడిదారీ విధానంలో అస్వాభావికంగా ధరల్ని పెంచడమనేది మరో రోగం. ముందుగానే వేసికొన్న పథకం ప్రకారం వ్యాపారస్థులు కొన్ని వస్తువుల్ని బజారులో లభించకుండా చేస్తారు. రహస్యంగా సరకుల లావాదేవీలు చూస్తూ స్పెక్యులేషన్ పద్ధతిపై ఆధారపడ్డ వాణిజ్య విధానాన్ని పాటిస్తూ జూదానికి అలవాటు పడి అధిక ధరల్ని సృష్టిస్తుంటారు. ఈ విధానంలో పెట్టుబడి స్తోమత ఉన్న వ్యక్తులకు ఇష్టానుసారం తమకు నచ్చిన వస్తువుల్ని ఎంత కావాలంటే అంత ఎక్కువగా తయారు చేసి అది అనవసరమైనా, హానికరమైనా, ప్రజల నెత్తిపై రుద్దడానికి స్వేచ్ఛ వుంది. స్వలాభమే ఈ వ్యక్తుల ధ్యేయం. ఇంకా ఈ వ్యక్తులు, సమాజ శ్రేయానికి దోహదపడే అత్యావసరాలను తీర్చేందుకు శ్రద్ధ వహించకుండా, తమ పెట్టుబడులను, కార్మికులను వినోద విన్యాసాలకు పనికి వచ్చే వస్తువుల్ని తయారు చేసేందుకు, విలాస పురుషుల కామ తృష్ణను తీర్చే సదుపాయాలను కల్పించడానికి ఉపయోగిస్తారు. వ్యాపార రంగంలోని బడా మనుషులు ఆర్థిక లోకంలో మకుటంలేని రాజులుగ చలామణి అవుతున్నవారు బహిరంగంగానో, రహస్యంగానో ఎన్నో స్వార్థ పథకాలు వేసికొని అంతర్జాతీయ స్థాయిలో కక్షలకు, కయ్యాలకు మనస్పర్థలకు దారి తీస్తుంటారు.

## పెట్టుబడిదారీ విధానంలో నయంకాని మరొక వాణిజ్యచక్రం

ప్రతి కొన్ని సంవత్సరాల తరువాత విస్తృతంగా సాగే వ్యాపారం అకస్మాత్తుగా పడిపోవడం జరుగుతుంది. వ్యాపారం ముమ్మరంగా సాగుతున్నప్పుడు, అకస్మాత్తుగా సరకులు, తగిన ధరకు గిడ్డంగుల నుండి వెలువడటం లేదని వ్యాపారి గ్రహిస్తాడు. అందుచేత డిమాండును తగ్గిస్తాడు. ఉత్పత్తి దారులు కూడా తగినట్టుగా ఉత్పత్తిని తగ్గించి వేస్తారు. ఇక పెట్టుబడిదారు రానున్న అపాయాన్ని గ్రహిస్తాడు. రుణాలివ్వడం ఆపివేస్తాడు. పైపెచ్చు పూర్వం యిచ్చిన బాకీలను చెల్లించమని ఒత్తిడి తెస్తాడు. కర్మాగారాలు మూతబడతాయి. నిరుద్యోగం పెరుగుతుంది. ధరలు ఇంకా తగ్గిపోతాయని భావించి తమ డిమాండును నిలిపివేస్తారు. ధరలు తగ్గడం మొదలెడతాయి. వ్యాపారులు, వాడకందారులు నిరుద్యోగం ఇంకా అధిక మవుతుంది. ప్రభుత్వ ఆదాయం తగ్గడం మూలంగా అదీ వ్యయాన్ని తగ్గిస్తుంది. సంక్షోభం ఇంకా ఉధృతమవుతుంది. చివరికి ఆర్థికవ్యవస్థ దివాలా తీసే స్థితికి దిగజారుతుంది. అకస్మాత్తుగా తిరిగి కథ అడ్డం తిరుగుతుంది. తిరిగి క్రమేణా పరిస్థితుల్లో మార్పులు రావడం, వ్యాపారం చురుకుగా సాగడం జరుగుతుంది. ఇలా వాణిజ్యచక్రం పెట్టుబడిదారుల సుదీర్ఘవ్యాధి అయి ఇంతవరకు చికిత్స, నివారణలను త్రిప్పికొడుతూ పోతోంది. (Ibid, పే: 84-88)

## పెట్టుబడిదారీ విధానాన్ని కూకటి వేళ్లతో పెకలించిన ఇస్లాం విధానం

ఈ క్రింది మార్గాలలో ఆర్జించిన ధనాన్ని స్వీకరింపరానిదిగ నిషేధించబడినదిగ, చట్టానికి విరుద్ధమయినదిగా ఇస్లాం ప్రకటించింది.

మోసం, లంచగొండితనం, దగా, ప్రభుత్వ పద్దులనుండి అవినీతితో ధనాన్ని దిగమ్రింగడం, దొంగతనం, తప్పుడు తూనికలు కొలతల్ని ఉపయోగించడం, అశ్లీలతను లజ్జావిహీనతను విస్తృత పరచే వ్యాపారం, వ్యభిచారం, మత్తుపదార్థాలు, మత్తుపానీయాలు తయారు చేయడం, లేదా వాటి వ్యాపారం

చేయడం, వడ్డీవ్యాపారం, జూదం, పరస్పరం విరోధం ద్వేషం పుట్టించేవ్యాపారం లేదా పగతీర్చుకొనేందుకు, లేదా ఒత్తిడులపై చేసే వ్యాపారం లేదా న్యాయానికి ప్రజా సంక్షేమానికి విరుద్ధంగ ఉండే వ్యాపారం.

అంతేకాకుండా, ఉత్పత్తి వనరుల్ని ధనాన్నీ సాధారణ వ్యక్తి నుండి దూరం చేసేబ్లాక్ మార్కెట్లు, గుత్తాధిపత్యం, రహస్యవ్యాపారాన్ని కూడా ఇస్లాం నిషేధిస్తుంది. కేవలం నిషేధించడమే కాక చట్టబలంతో ఇస్లాం వీటన్నిటినీ నామరూపాలు లేకుండా సమాజం నుండి పైదొలిగిస్తుంది కూడా.

(ఇస్లామీ నజ్మె మయీషత్ కె ఉసూల్ వ మఖాసిద్, పే: 12-13)

## "వడ్డీ" అంటే కొల్లగొట్టడమే

రుణాల రూపంలో పొందిన ధనంతో, కర్షకులయినా, ఇతర సంస్థలయినా లాభపడినట్లయితే, లేక లాభపడక పోయినట్లయితే కూడా వారి నుండి ఒక నిర్ణీతమైన లాభం పుచ్చుకొనే హక్కు పెట్టుబడిదారుకు లేదు. ఒక వ్యక్తి గాని, సంస్థగాని తమ పెట్టుబడులను, వ్యాపారం నిమిత్తం, పరిశ్రమల కోసం, పాడిపంటల కొరకు రుణాలుగా ఇవ్వడం, పర్యవసానంగా ఒక నిర్ణీత లాభం పొందడానికి రుణాలు ఇచ్చినప్పుడే నిర్ణయం తీసుకోవడం అనేదే వడ్డీలో ఉన్న అసలు రోగం. నిర్ణీత గడువులో రుణంద్వారా నడిపే వ్యాపారంలో, ఒకవేళ లాభం సమకూరితే ఎంత ఫాయిదా కలిగింది అన్న వాదంతో వడ్డీ వ్యవస్థకు ఏమాత్రం పని లేదు. నెలనెలకూ, లేదా సాలుకొకమారు నిర్ణీత లాభం పొందడం ఆ తర్వాత ఇచ్చిన రుణాన్ని తిరిగి రాబట్టుకొనే హక్కు కలిగి ఉండడమే పెట్టుబడి వ్యవస్థ లక్ష్యం.

మనం ఈ విధానానికి స్వస్తి చెప్పాలి, కోటి ప్రయత్నాలు చేసి కూడ ఈ వడ్డీ విధానం సరియైనదే అని ప్రపంచంలో ఎవరూ నిరూపించలేరు. అందుకు ఆధారాలేమీ లేవు. దీనికి విరుద్ధంగా ఇస్లాం విధానం ఉంది. మీరు రుణాన్ని ఇస్తున్నారంటే అది కేవలం రుణంగా పరిగణించబడుతుంది. ఇచ్చిన రుణం తిరిగి పుచ్చుకునే హక్కు మీకుంటుంది. మరి మీకు లాభం కావాలంటే మీరు

ఆ వ్యాపారంలో భాగస్వాములు కావాలి. (మీరు మీ ధనాన్ని) పాడిపంటల్లో గాని, పరిశ్రమల్లో గాని, వ్యాపారాలలో గాని పెట్టుబడిగా వినియోగిస్తే అందులో వచ్చిన లాభాన్నయినా నష్టాన్నయినా మీరు మరియు మీ ధనం వినియోగించి కృషి చేసినవారు ఒక నిర్ణీత నిష్పత్తిలో పంచుకొనే షరతు తప్పకుండా ఉండాలి. న్యాయం ఇదే కోరుతుంది. ఈ విధానం మన ఆర్థిక విధానాన్ని అభివృద్ధి పరుస్తుంది, ఇస్లామీయ సిద్ధాంతాలు దీనినే అభిలషిస్తాయి. (Ibid, పే: 26-27)

## స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాపాడుతూ పెట్టుబడి విధానాన్ని ఎలా అంతమొందించాలి?

ఇస్లామీ షరీఅత్ దృష్టిలో వ్యాపారం, పరిశ్రమలు ఇంకితర ధనార్జనమార్గాలు వనరులు ఒక పరిమిత వర్గం లేదా సముదాయానికే చెంది ఉండరాదు; ఈ వర్గం పైపెచ్చు ఇంకా అపరిమితమైపోతూ ఉండడం చట్టపరంగా అన్యాయం. ఈ పరిస్థితిని సరిదిద్దడానికి పరిమితవర్గపు సిరిసంపదలను జప్తుచేసికొని ప్రభుత్వ ఆస్తిగా మార్చడం ఎలా ఉంటుందంటే ఒక చిన్న వ్యాధి నివారణకోసం పెద్ద శస్త్ర చికిత్స చేయడమవుతుంది. ఈ రెండిటికి మధ్యస్థ మార్గం - భవిష్యత్తులో సిరిసంపదలు ఏ కొద్దిమంది చేతుల్లో చేరకుండా ఉండడానికి ఇస్లాం ధన సంపాదనలో నిషేధించిన పద్ధతులన్నిటిని చట్టపరంగా నిషేధించాలి. కొద్దిమంది చేతుల్లో చేరిన ఐశ్వర్యాన్ని షరిఅత్‌కు వ్యతిరేకంకాని విధానాల ద్వారా క్రమక్రమంగా సమాజంలో పంచబడేట్లు చేయాలి.

(గైడ్‌లైన్స్ ఇన్ ది కాన్‌ఫ్లిక్ట్ ఆఫ్ ఐడియాలజీస్, పే: 19)

## పెట్టుబడిదారి విధానం నయంకాని పుండు

ప్రస్తుత పెట్టుబడిదారి విధానపు సమాజానికి నయంకాని పుండుగా ఉందని నేను భావిస్తున్నాను. అందువల్ల అది ఏ రూపంలో ఉన్న, ఏ విధంగా ఉన్న, ఏ భావంతో వచ్చిన అంగీకరించడానికి నేను సిద్ధంగా లేను.

(Ibid, పే: 24)

## అక్రమ భూకబ్జాలు

ప్రభుత్వ బలంతో భూములను హస్తగతం చేసుకోవడం, అన్యాయంగా, అన్యాక్రాంతంగా , చట్టవిరుద్ధంగా ఇంకా షరీఅత్ నిషేధించిన ఏ రూపంలోను భూ యాజమాన్యపు హక్కు పొందడం ధర్మవిరుద్ధం. ఇస్లాం అనుమతించని పద్ధతి కూడా. (Ibid, పే: 18)

## ఇస్లాంకు సోషిలిజంకు అసలు పొంతనే లేదు

ఇస్లాం మరియు సోషియలిజం అనేవి రెండు విభిన్న దృక్పథాలు. ఇస్లాంకు మూలం మనమంతా ఒకే దైవానికి (అల్లాహ్‌కు) చెందాము అనే విశ్వాసం. అల్లాహ్ తన ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ద్వార దివ్య ఖుర్ఆన్ రూపంలో జీవిత సమస్తరంగాలకు చెందిన హితువులనిచ్చాడు. ఈ హితవులపై మాకు అచంచల విశ్వాసం ఉంది. ముస్లింలు కావడంవల్ల మనము ఆ హితువుల్ని తప్పకుండా పాటించాల్సిందే. మన జీవిత లక్ష్యం దైవ ప్రసన్నత, పరలోక సఫలత పొందడమే. దైవం ఇచ్చిన హితువుల్ని, ప్రవక్త చూపిన పంథాను పాటించడం ద్వారానే అవి మనకు ప్రాప్తమవుతాయి. ఈ విశ్వాసం ఆధారంగా ఆధ్యాత్మిక, నైతిక రంగాలలో ఇస్లాం మనకు ఒక సంపూర్ణ జీవనసరళిని సమకూరుస్తుంది. ఈ విధానాన్ని పాటించడంవల్ల మా జీవితం మూల విశ్వాసానికి అనుగుణంగా రూపొందుతుంది. నైతిక ఆధ్యాత్మిక చింతనతో బాటు గృహజీవితంనుండి బాహ్యప్రాపంచిక జీవితం వరకు, న్యాయస్థానాల నుండి పార్లమెంటు సమావేశాల వరకు, వ్యాపార వ్యవహారాలనుండి అంతర్జాతీయ సంబంధాలవరకు ఇస్లాం ఒక సమగ్రమైన సూత్రావళిని, నిబంధనల్ని, చట్టాల్ని రూపొందించి మనకందించింది. వాటి అనుసరణే మనకు శ్రేయం.

సంక్షిప్తంగా చెప్పాలంటే దీనికి విరుద్ధంగా ఉంది సోషియలిజం. మనకు దైవ హితువులు అవసరం లేదు,ప్రవక్త ప్రవచనాలు అంతకన్నా అవసరం లేదు, మన అవసరాల్ని బట్టి మనకున్న పరిజ్ఞాన పరిధిలో మన జీవిత విధానాల్ని రూపొందించుకునే హక్కు మనకుంది అనే ధోరణిలో సోషియిలిజం

ప్రారంభమవుతుంది. ఈ భావాన్ని ఆధారంగా చేసుకుంటూ సోషలిజం ఒక చరిత్రాత్మక తత్వాన్ని ప్రబోధిస్తుంది, ఒక ఆర్థిక విధానాన్ని అనుసరిస్తుంది, ఆ తర్వాత అబద్ధాలు, అలజడులు, హత్యాకాండలు సర్వసామాన్యమయిపోతాయి.
(మార్గదర్శక సూత్రాలు, పే: 7,8)

## సోషలిజంలోని అసలు లోపం

ఆర్థిక రంగంలో వ్యక్తిగత ఆస్తిని, స్వేచ్ఛను హరించడం సోషలిజంలో ఉన్న అసలు లోపం. "ఆర్థిక వనరులన్నీ సమీకరించి వాటిని సామూహిక ఆస్తిగ పరిగణించి, వ్యక్తులు సామూహిక యంత్రాలుగా మారాలి" అనే సిద్ధాంతాన్ని సోషలిజం ప్రతిపాదిస్తుంది. వ్యక్తివాద సిద్ధాంతం (Individual Theory) పై విమర్శనాస్త్రాలు కురిపిస్తూ ప్రచారానికెక్కిన ఈ 'సోషలిజం' సామూహిక ఆస్తిని సద్వినియోగపరచడంలో ఈ వ్యక్తులే నీతిమంతులుగా ప్రవర్తిస్తారని, అవినీతికి బహుదూరంగా ఉంటారని, వారి సామూహిక అజమాయిషీలో దేశంలోని ఆర్థిక వనరులు సక్రమరీతిలో వివిధ రంగాలకు కేటాయించబడతాయని, ఆదాయా ల పంపిణి న్యాయసమ్మతంగా జరుగుతుంది అని విశ్వసించడం వేసవిలో ఎండమావుల్ని చూచి నీరని నమ్మడం తప్ప మరేమీ కాదు.

సామూహిక ఆస్తి, సామూహిక ఆదాయాల పంపిణి అన్న అంశానికొచ్చే టప్పటికి సామర్థ్యం కల వ్యక్తులు తమ తమ వ్యక్తిగత నైపుణ్యాన్ని ప్రదర్శించడంలో, శ్రద్ధాశక్తిని కనబరచరు, సగటు శ్రామికులు మరింత సోమరితనానికి అలవడతారు. ఫలితంగా ఉత్పత్తి కుంటుపడుతుంది. దీనికితోడు అధికార్ల అవినీతి విలయతాండవం చేస్తుంది. సామూహిక యంత్రాలుగా కష్టపడి పనిచేసే శ్రామికులపై అధికార్లు, 'దొర'లైకూర్చుంటారు. దూరదృష్టి కలవారెవరయినా సరే సోషియలిజం మూల సిద్ధాంతంలోని లోపాన్ని బాగా అర్థం చేసుకోగలరు. 50 ఏండ్ల అనుభవం సోషియలిజంలోని ఈ రుగ్మతల్ని చవిచూస్తూనే ఉంది. (Ibid, పే:8)

## నియంతలను సృష్టించే సోషలిజం

రష్యా మరియు చైనాలో సోషలిస్టు సమాజ స్థాపనకు రెండు గొప్ప ప్రయోగాలు జరిగాయి. ఈ రెండు దేశాలలోనూ అధినేతలుగా ఒకే వ్యక్తిని దైవస్థాయి వరకు చేర్చడమయింది. రష్యాలో స్టాలిన్ అలాంటి స్థాయికే చేరుకున్నాడు. పర్యవసానంగా అతని చర్యల వల్ల పరిణమించిన దుష్ఫలితాల్ని యావత్ ప్రపంచం చవిచూచింది. చైనాలో మావో వ్యక్తిత్వం అత్యున్నతంగా ఎదిగి అదే ప్రజలకు ఆదర్శమయింది. దీనివల్ల సంభవించిన భయంకర ఫలితాలు కూడా మనముందున్నాయి. కాని అదే దేశంలో లియోసోచీ అంతటి వ్యక్తి అందరి తిట్లకు గురయ్యాడు. అతను తన స్థానమేమిటో చెప్పుకోడానికి కూడా అవకాశాన్ని పొందలేక పొయ్యాడు.

భూమి, వాణిజ్యం, పరిశ్రమలు మొదలయిన వ్యవహారాలు వ్యక్తుల చేతుల్లో ఉండడం మంచిది కాదని సోషలిజం అంటుంది. ఇదే సోషలిజం, కాపిటలిజంల మధ్య ఉన్న బద్ధవైరం. సోషలిజం ఆర్థిక వనరులన్నిటిని సమీకరించి సోషలిస్టు ప్రభుత్వానికి హస్తగతం చేస్తుంది. మరోమాటలో చెప్పాలంటే అది ఇంతకు ముందు ఉన్న పెట్టుబడిదారీ విధానం కంటే విపరీతంగ పెట్టుబడిని ఒకే చోట కేంద్రీకరిస్తుంది. అంతేకాదు, ఆ పెట్టుబడులపై భూస్వాములు బడావర్తకులకన్నా అధికంగానే పెత్తనం చెలాయిస్తుంది. వారందర్నీ వ్యక్తిగతంగా బలహీనపరచి ఒక పెద్ద భూస్వామిగా, పెట్టుబడిదారుగా మారిన ప్రభుత్వం ముందు దాసోహం పలికిస్తుంది. ఈ విధానంలో ప్రభుత్వం అనబడే ఈ ఏకైక సంస్థ చట్ట వత్తిడితో, రాజకీయ ప్రభావంతో, సైన్యాధికారంతో ఆర్థిక వనరులన్నిట యాజమాన్య హక్కులు పొందుతుంది, ఇలా వెర్రి వ్యామోహంతో ఈ సోషలిజం ఏఇజంలో కూడా లేనంతటి దారుణ నియంతృత్వాన్ని ఉనికి లోనికి తెస్తుంది. (Ibid, పే: 8,9)

## సోషలిస్టు వ్యవస్థ - ఒక పెద్ద కారాగారం

సోషలిస్టు వ్యవస్థను గురించి బాగా ఆలోచించి చూస్తే నిజం అర్థమవుతుంది. ఈ వ్యవస్థలో ఆచరణాత్మకంగా ఏకొద్ది వ్యక్తులచేతుల్లోనో లేదా

ఒక ప్రత్యేక వర్గం చేతుల్లోనో సంపద పంపిణీ అధికారం ఉంటుంది. ఈ అధికారం రాజరికపు వ్యవస్థ మరియు పెట్టుబడిదారీ విధానంలో కన్నా ఎన్నోరెట్లు అధికంగా కేంద్రీకరించబడి ఉంటుంది. సోషలిస్టు వ్యవస్థలో రాజకీయ బలం, ఉత్పత్తి వనరులు ఒక ప్రత్యేకవర్గం పిడికిట్లో ఉంటాయి. వారే ఆ అధికారానికి ప్రభువులు. ఇలాంటిపద్ధతి పెట్టుబడిదారీ విధానంలోకానీ, రాజరికపు వ్యవస్థలోకాని, దొరతనపు పరిపాలనా పద్ధతిలోకానీ ప్రపంచంలో మరెక్కడా మచ్చుకు కూడా కానరాదు. ఇలా, అధికారాన్ని హస్తగతం చేసుకున్న తర్వాత ప్రజల జీవితావసరాల్ని తీర్చే బాధ్యత తీసుకొన్నప్పుడు వారివైఖరి ఎలా వుంటుందంటే ఒక జైలర్ ఖైదీలకు తిండి, బట్ట, ఉండేందుకు అంత ఆసరా, రోగంవస్తే ఇంత మందు ఇచ్చే బాధ్యత తీసుకొన్నట్లుంటుంది.

(Ibid, పే:14,15)

## ఇస్లాం మరియు సోషలిజం: వర్గవిధానం

పెట్టుబడి, శ్రమ ఆధారంగా వర్గీకరణ చేయటమంటే చట్టబలంతో పరిపాలనా యంత్రాంగంతో ఈ వర్గీకరణాన్ని శాశ్వతంగా అమలు జరపడమే. కాని ఇలాంటి వర్గీకరణానికి ఇస్లాంలో చోటులేదు. ప్రకృతి కారణాల వల్ల కలిగే వర్గ వ్యత్యాసాలను అంతం చేయడానికి ఇస్లాం ప్రయత్నించదు. అలా చెయ్యడం ప్రకృతితో యుద్ధం చేసినట్లవుతుంది. ఉదాహరణకు ఒక వ్యక్తి ఉన్నత కుటుంబంలో లేదా అభివృద్ధిచెందిన స్థానంలో జన్మించినట్లయితే అతని జీవితం ప్రకాశవంతంగా ప్రారంభమవుతుంది. కాని అతడు ఆ స్థానాన్ని నిలబెట్టుకునే లేక ఇంకా అభివృద్ధి చేసుకునే సామర్థ్యాన్ని కోల్పోయినట్లయితే పుట్టుకతో అతనికి లభించిన స్థానంలో క్షీణత కలుగుతుంది. దీనికి వ్యతిరేకంగా ఒక మనిషి పేద కుటుంబంలో లేదా వెనుకబడ్డ స్థానంలో జన్మించినట్లయితే అతడు ఎలాంటి స్థితిలో ఉంటాడో అదే స్థితితో తన జీవితాన్ని ప్రారంభిస్తాడు. కాని సామర్థ్యముంటే అల్లాహ్ దయవల్ల అతడు ఉన్నత స్థానాన్ని అందుకోవచ్చు. ఉన్నత స్థానమేకాదు, అత్యున్నత స్థానానికి కూడా చేరవచ్చు. అలా జరగటానికి ఇస్లాం వ్యవస్థలో ఎలాంటి అవరోధాలు ఉండవు. ఇవి అల్లాహ్ సృష్టించిన స్వాభావిక వర్గాలు,

ఏ సమాజంలో అయినా సరే ఇవి ఉంటాయి. ఇలా ఏర్పడ్డ వర్గాలు స్వాభావికంగా ముందుకు సాగిపోతుంటాయి.

ఇస్లాంలోని చట్టాలు, నియమాలు ఇలాంటి వర్గాల్ని శాశ్వతంగా వాటి ప్రారంభ స్థితుల్లోనే ఉండేందుకు నిర్బంధం చెయ్యవు. పైగా ప్రకృతి సిద్ధమయిన పేద, ధనిక వర్గాల మధ్య వైషమ్యాలు, వర్గపోరాటాలకు అవకాశమివ్వకుండా, పేద వాళ్ళు తమ స్వశక్తిపై ఆధారపడటానికి వీలుగా వారికి స్థితిపరులనుండి సహాయం లభించేలా మరియు తిండి, బట్ట, ఇల్లు, మందు, విద్య లాంటి ప్రాథమిక జీవితావసరాలు లేనివర్గం అంటూ సమాజంలో లేకుండా చెయ్యడానికి ఇస్లాం పరిపూర్ణమైన ఏర్పాట్లు చేస్తుంది.

ఇస్లాం పట్ల ముస్లింల నిర్లక్ష్య వైఖరి వల్ల ఎప్పుడైనా వర్గ విధానం జరిగి ఉంటే, అది ఎప్పుడూ దుష్ఫలితాలకే దారి తీసింది. ఇలాంటి దుష్ఫలితాలకు దారితీసే సోషలిజం లాంటి వర్గవిధానం తన సిద్ధాంతాలలో ఓటమి పొందినప్పటికి, బలప్రయోగం ద్వారా సమానతను సృష్టిస్తాం అని మీరు నిశ్చయించుకుంటే అది మీరు చేసే మరోతప్పు అవుతుంది. ఈ తప్పు మొదటి దానికన్నా భయంకరమయింది.

ప్రకృతికి వ్యతిరేకంగా యుద్ధం చేసినట్లయితే అది పైన తెలిపిన వైఖరివల్లనైనా సరే, దాని ఫలితాలు కూడా మన ఎదుట ఉన్నాయి లేదా ఇప్పుడు తలపెట్టే రెండవ విధానాన్ని (సోషలిజం) అనుసరించినా సరే పరిణామాలు మాత్రం తప్పకుండా ముప్పునే తెచ్చి పెడ్తాయి. వర్గవిధానం లేని సమాజమే తమ ధ్యేయమని సోషలిజం ప్రకటించినా, ఇంతవరకు అది ఈ ధ్యేయాన్ని ఎందుకు సాధించలేకపోయింది? మునుపటి వర్గాల స్థానాన్నే కొత్తవర్గాల్ని ఎందుకు సృష్టించింది? కారణం ఒక్కటే. సహజంగా ఏర్పడిన వర్గాల్ని ఏ విధంగానైనా మార్చలేం, ప్రకృతికి వ్యతిరేకంగా ప్రొలిటేరియట్ వర్గం పేరిట సోషలిజం మూఢత్వంలో హత్యాదౌర్జన్యాలకైనా వెనుదీయక అనేక దుష్ట మార్గాలను అవలంబిస్తూ ఇదివరకటి ధనిక వర్గీయులను అంతంచేసిందే కాని స్వతహాగా కొత్తకొత్త వర్గాల్ని సృష్టించడం దానికి తప్పలేదు. సోషలిస్టులు ఈ

నూతన వర్గాల సంకెళ్ళలో ఏ ప్రొలిటేరియట్ వర్గం పేరు తీసుకొని వర్గ రహిత సమాజాన్ని స్థాపిస్తాం అని ప్రగల్భాలు పలికారో ఆ వర్గాన్ని ఇప్పుడు విపరీత బాధల్ని అనుభవించేలా చేశారు. గతంలో మన అనుభవం ఒకే ఒక గుణపాఠాన్ని నేర్పుతూంది. అదేమిటంటే మనమంతా అసహజ పద్ధతుల్ని విడనాడి, ఇస్లాం చూపే సహజ విధానం వైపునకు మరలాలి. (Ibid, పే: 13,14)

## ఇస్లామిక్ సోషలిజం - ఒక మాట

సోషలిజం అనేది కేవలం పెట్టుబడిదారీ విధానంలోని దోపిడితనాన్ని వ్యతిరేకించే రుణాత్మక పదం మాత్రం కాదు. ధనాత్మకమైంది కూడా. ఇది ఒక విషయాన్ని త్రోసిపుచ్చుతూ దాని స్థానే అలాంటిదే మరో విషయాన్ని సమర్థిస్తోంది. ఈ ధనాత్మక రుణాత్మక విషయాలు పరస్పర సంబంధం కల్గి వుంటాయి. అందుచేత ఇస్లామిక్ సోషలిజం అన్న పదజాలాన్ని ఉపయోగించినప్పుడు అది పెట్టుబడిదారీ విధానంలోని దోపిడితనాన్ని వ్యతిరేకించడంతో పాటు ధనాత్మకంగా సమర్థించే విషయాన్ని కూడా మనకు జ్ఞప్తికి తెస్తుంది. సోషలిజం అనే పదానికి "ఇస్లామిక్" అన్న పదం జతపర్చి చెప్పుకునే విధానం అనేక సోషలిస్టు పద్ధతుల్లో ఇదొకటి అని తెలుస్తుంది. వేరుగా చెప్పాలంటే ఇది ఇస్లాం యొక్క సరికొత్త "ఎడిషన్" అని చెప్పాలి. ఇది ఇస్లాంలోని కొన్ని భాగాల్ని, సోషలిజంలోని కొన్ని భాగాల్ని మిళితం చేసిన నూతన విధానం. అయితే ఇప్పుడు ఇస్లాంలో చేరిన ఈ సరికొత్త సోషలిజంలోని మూలకాల స్థానం ఏమిటి? ఇస్లాంలో ఉన్న కొన్ని తప్పులను, తొలిగించేందుకు అందులోలేని వాటిని ప్రవేశపెట్టేందుకు ఈ మూలకాలు పనికొస్తున్నాయన్నమాట! అయితే నా ఉద్దేశంలో ఇలా తప్పులతో కూడుకున్న మతం పట్ల విశ్వాసం కల్గిఉండనవసరం లేదు.

దైవం, దైవ ప్రవక్త (సఅసం) తెలియజేసిన ఇస్లాం దృక్పథాన్ని సోషలిజం విధానాలతో మేళవించి, సరికొత్త అచ్చులో ఒక నూతన ధర్మాన్ని రూపొందించ దలచుకున్నవారు ముస్లింలలో ఉంటూ ముస్లింలను పెడదారి పట్టించడాన్ని మానుకోవాలి. అలాంటి వారు "బహాయి" వర్గంలా వేరయిపోయి తాము రూపొందించుకున్న నూతన ధర్మాన్ని నిరభ్యంతరంగా ప్రచారం చేసుకోవచ్చు.

ఇస్లాం నుండి అరువు పుచ్చుకునే విధానం ఏదయినాసరే అది ఖుర్ఆన్ మరియు హదీసు హితువుల వెలుగులోనే ఉండాలి తప్ప వేరుగా ఉండరాదు. వాస్తవంగా ఈ విషయంలో వారు ఏకీభవించినట్లయితే సోషలిజం ప్రస్తావన తేవడమెందుకు? దివ్య ఖుర్ఆన్‌కు, మహా ప్రవక్త (సఅసం) ప్రవచనావళికి అనుగుణంగా ఉండేదే ఇస్లాం. నూతన ధర్మం రూపంలో ఇస్లాం వాక్యాలను మరో అచ్చులో పోతపోసి చెలామణిలో తెచ్చేందుకు ఇస్లాం ఎప్పుడు దివాలా తీసిందని?

(Ibid, పే: 23)

## సెక్యులరిజం

సెక్యులరిజమ్ అంటే లౌకిక విధానం బోధించే మూల సూత్రాల్ని పరిశీలించండి. మతానికి మనిషి వ్యక్తిగత జీవితంతో మాత్రమే సంబంధం ఉంది అన్న దృక్పథం అర్థరహితమైంది. ఇది హేతువు ఎదుట నిలువజాలదు. మనిషి మరియు దైవం మధ్య ఉన్న సంబంధం పట్ల రెండుదృక్పథాలు ఉన్నాయి. మనిషిని మరియు విశ్వాన్ని సృష్టించింది దేవుడు. ఆయనే మనిషికి ప్రపంచానికి ప్రభువు, పరిపాలకుడు అనేది ఒకటి, అలా కాదనేది రెండోది. దేవుడు సృష్టికర్త యజమాని, పరిపోషకుడు కానట్లయితే ఆయనతో ప్రయివేటు సంబంధం కలిగి ఉండడం కూడా అనవసరం. ఎవరితో మనకు బలమయిన సంబంధంలేదో ఆయన్ను అనవసరంగా ఆరాధించడమనేది అర్థం లేని విషయం.

ఆయనే మనకు, సమస్త విశ్వానికి సృష్టికర్త, ప్రభువు, పాలకుడు అయిన సందర్భంలో ఆయన అధికార పరిధి కేవలం ఒక వ్యక్తిగత జీవితం వరకే ఉంది. ఒకరిని మించి ఇద్దరి సామాజిక సంబంధం ప్రారంభమౌతూనే ఆయన అధికారం చెల్లదు అని వాదించడంలో వివేకమనిపించదు. ఒకవేళ దైవమే ఇలాంటి సరిహద్దుల్ని ఆదేశించి ఉంటే దానికి ఆధారం ఏమిటో తెలియజేయాలి. అలా కాకుండా మనిషి అహంభావంతో విర్రవీగుతూ సామాజిక వ్యవస్థలో తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించడం అనేది సృష్టికర్త, ప్రభువు, పాలకుడయిన దైవం పట్ల ద్రోహం చెయ్యడమే.

దైవం పట్ల విద్రోహిగా తయారయి ఒకవ్యక్తి తన వ్యక్తిగత జీవితంలో దైవాన్ని, దైవబోధనల్ని నమ్ముతూ ఉన్నాడంటే ఆ వ్యక్తి అవివేకి అనడంలో సందేహమేమీ లేదు. వ్యక్తిగతంగా ప్రతి మనిషి దైవానికి దాసుడు అంటూ ఇలాంటి దాసులు ఇద్దరు లేక ఎక్కువమంది చేరి సమాజంగా ఏర్పడగానే మేము దైవానికి దాసులము కాము అనంటే అలాంటి వారు మతి కోల్పోయారు అనడంలో సందేహమేలేదు. ప్రతివ్యక్తి వేరు వేరుగా దైవాన్ని సృష్టికర్తగా, స్వామిగా అంగీకరిస్తూ, సామూహికంగా తాము నమ్మిన సత్యాన్ని నిరాకరిస్తారా! ఇలాంటి దృక్పథం ఒక మతి పోయిన వ్యక్తి తయారుచేసిన సరకు తప్ప మరేమీ కాదు.

మన గృహ జీవన విషయాలలో మన పరిసరాలలో పట్టణాలలో, పాఠశాలల్లో, కళాశాలల్లో బజారుల్లో, వ్యాపార కేంద్రాలలో, విధానసభలలో, ప్రభుత్వ భవనాలలో, న్యాయస్థానాలలో, సచివాలయాలలో, సైనిక శిబిరాలలో, పోలీసు కేంద్రాలలో, యుద్ధరంగాలలో శాంతిసమావేశాలలో దైవం మరియు దైవబోధనల అవసరం లేనట్లయితే మరెక్కడ వాటి అవసరమో నాకు అర్థం కావడంలేదు. జీవిత వివిధ రంగాలలో మనకు దైవం హితవుల నివ్వనప్పుడు లేదా ఏ విషయంలో కూడా ఆయన హితవులు ఆచరణాత్మకంగా హేతుబద్ధంగా లేనిపక్షంలో (దైవం మమల్ని క్షమించుగాక!) అలాంటి దైవంపట్ల మనం ఎందుకు విశ్వాసం కలిగి ఉండాలి? ఆయన్ను ఎందుకు ఆరాధించాలి?

ఇది కేవలం సమస్య యొక్క సూత్రప్రాయమైన దృక్పథం మాత్రమే. ఆచరణాత్మకంగా చూస్తే దాని పరిణామాలు భయానకంగా ఉంటాయి. మనిషి ఎప్పుడయితే అల్లాహ్‌తో తన సంబంధాల్ని త్రెంచుకొంటాడో అప్పుడే అతని సంబంధం షైతానులతో ముడిపడడం తథ్యం. మనిషి తన ప్రయివేటు జీవిత పరిధిలోనే ఉండడు. ఇది ఒక వాస్తవం. మానవుడు సంఘజీవి. అతని జీవితమంతా సామాజికమే "అతడు మాతా పితా"అనే సామాజిక సంబంధం వల్లనే ఈ ప్రపంచంలో జన్మించాడు. కన్నుతెరవగానే కుటుంబ జీవితంలో అడుగు పెట్టాడు. తెలివిరాగానే అతడు సమాజంతో, పట్టణవాసులతో, జాతితో, సంస్కృతితో, ఆర్థిక రాజకీయ విధానాలతో సంబంధం కలిగిఉంటాడు. వ్యక్తిగత

పరమయిన యోగక్షేమాలు, సామాజికపరమయిన సంక్షేమాలు అనేవి మానవులు ఏర్పరుచుకున్న సత్సంబంధాలపై ఆధారపడి ఉంటాయి. ఈ సంబంధాలను సరిగ్గా న్యాయసమ్మతంగా, నిరంతరం ఉపయోగపడేట్లుగా కట్టుదిట్టంచేసి మానవులకు సమకూర్చేది కేవలం అల్లాహ్ ఒక్కడే. ఏ సమాజంలోని సామాజికవ్యవస్థ సెక్యులరిజం లేక లౌకిక విధానంపై నడవబడుతుందో దాని సూత్రాలు ఆ ప్రజల కోరికలను బట్టి, మనస్తత్వాల్ని బట్టి ప్రతిదినం మారుతూ రద్దుచేయబడుతూ ఉంటాయి.

ఇలాంటి సమాజంలో దౌర్జన్యం, అన్యాయం, అపనమ్మకం, విశ్వాస రాహిత్యం అనేవి మానవ సంబంధాల మూలమూలల్లో చోటుచేసుకొని ఉండడం మనం చూస్తూనే ఉన్నాం. వారి వ్యవహారాలన్నింటిలో వ్యక్తి, వర్గ, జాతీయ, స్వార్థపరత్వం గూడుకట్టుకొని ఉంది. ఇద్దరు వ్యక్తులు మొదలుకొని జాతీయస్థాయి వరకు ఇక్కడ మానవకలయికలు నిస్వార్థంగా ఉండడం లేదు. వ్యక్తులు, వర్గాలు, జాతులు అందరూ వారివారి అధికార పరిధుల్లో వారికి సాధ్యమయినంత వరకు స్వార్థాన్నే దృష్టిలో పెట్టుకొని చట్టాల్ని, నిబంధనల్ని ఏర్పరచుకొన్నారు. పర్యవసానంగా ఎవరయితే సెక్యులరిజాన్ని అనుసరించారో, వారు వ్యక్తులయినా, వర్గాలయినా, జాతులయినా, దేశాలయినా సరే అంతా బాధ్యతా రాహిత్యంతో మితిమీరిన స్వార్థపరులుగా మారడం తప్పనిసరి అవుతుంది.

(ఇస్లామీ నిజాం ఔర్ మగ్రిబీ జమ్హూరియత్ 9-5-1947 ప్రసంగం)

## జాతీయతత్వం

ప్రారంభంలో జాతీయ తత్వమనేది "పోపు" మరియు 'చక్రవర్తి' విశృంఖల వ్యవహారాన్ని, సర్వవ్యాపిత అధికారాన్ని ఎదిరించడానికి వెలసిన ఉద్యమం. మత గురువులకు గాని, రాజకీయ శక్తులకుగాని 'జాతులు' పావులుగా మారకుండ తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తూ రాజకీయ తదితర రంగాలలో స్వయం నిర్ణయాధికారానికి అర్హత కలిగి ఉండాలన్నదే జాతీయతత్వం ముఖ్యోద్దేశ్యం. ఇలా అమాయకంగా ప్రారంభమై రాను రాను సెక్యులరిజం దైవాన్ని జీవిత ఆచరణరంగాల నుండి తొలగించినట్లే, సెక్యులరిజం స్థానే జాతీయతత్వం

తిష్ఠవెయ్యసాగింది. ఇప్పుడు ప్రతి జాతి తన స్వప్రయోజనాన్నే అత్యున్నత నైతిక ప్రమాణంగా పరిగణించసాగింది. మంచి అన్నది ఏదయిన ఉంటే, అది జాతికి లాభం చేకూర్చేదే! అబద్ధం, మోసం, దౌర్జన్యం మరేదైనా, మతపరంగా పూర్వపు నైతిక విలువల రీత్యా ఎంత హీనమైనవిగా పరిగణించబడేవైనా జాతికి లాభం చేకూర్చాయంటే అవే "మంచి"గా పరిణమిస్తాయి. సత్యం, న్యాయం, వాగ్దానం, విశ్వాసం, గౌరవం లాంటివి ఏవైనా నైతికంగా పూర్వం అవి ఎంత గొప్పగా శ్లాఘించబడినా, జాతి "ప్రయోజనాలకు" వాటిని పాటించడం వల్ల నష్టం చేకూరే ప్రమాదముంటే, అవన్నీ "చెడు"గా రూపొందుతాయి.

(Ibid, పే: 12,13)

జాతీయత అనేది ఒక స్వాభావిక వాస్తవికత. అందుచేత జాతీయతకు మేము వ్యతిరేకులంకాము. జాతీయ సంక్షేమం అభిలషనీయమైందే. కాని ఈ అభిలాష సాధించుకోవటంలో పరజాతుల పట్ల పక్షపాత వైఖరి నవలంబించరాదు. దేశంపట్ల ప్రీతి కల్గిఉండడం సమంజసమైందే! కాని జాతిపట్ల త్యాగశీలత పరజాతుల పట్ల ఈర్ష్య కల్గించేంత వరకు పోరాదు. స్వజాతీయుల పట్ల మితిలేని స్వార్థం,పరజాతుల పట్ల పగ పనికిరావు. ప్రతిజాతికి స్వేచ్ఛ అవసరం. దానికి తన ఆంతరంగిక విషయాలపై యాజమాన్యపు హక్కు ఉండి తీరాలి. ఇంటిని చక్కబెట్టుకొనే అధికారం దానికి ఉండవలసిందే. ఒక జాతిని మరో జాతీయులు పరిపాలించడమనేది కూడా సరైన విధానం కాదు. కాని జాతీయుల్ని, జాతీయతను ఆరాధించడమంటే మాకు గిట్టదు. అలాంటి స్వార్థతత్వం అంటే మాకు అసహ్యం. స్వయాన్ని ఆరాధించడమే నిజానికి నేడు జాతీయతగా మారింది. సమాజంలో ఒక వ్యక్తి స్వయానికి దాసుడై మంచి చెడులను చూడక స్వార్థం కోసం ప్రాకులాడుతుంటే ఆ వ్యక్తిని ఎలా నిరసిస్తామో, ఒక పట్టణంలో ఒకే కుటుంబం కళ్ళుమూసుకొని గ్రుడ్డిగా స్వలాభాపేక్షతో స్వయం ఆరాధనలో మునిగి తేలుతుంటే ఆ కుటుంబం పట్ల ఎలా అసహ్యం కల్గుతుందో, దేశంలో ఒక వర్గం ఇతర వర్గాలన్నిటినీ ఉపేక్షిస్తూ ఎప్పుడూ స్వంత లాభాన్నే ధ్యేయంగా పెట్టుకొని దానికోసం నిరంతరం తాపత్రయ

పడుతుంటే ఆ వర్గాన్ని ఎలా హీనంగా చూస్తామో అదే విధంగా అంతర్జాతీయ స్థాయిలో కూడా ఒక జాతి స్వార్థాన్నే దైవంగా చేసుకొని ధర్మాధర్మాలను లెక్క చేయకుండా ప్రవర్తిస్తూ, తన ప్రవర్తననే సత్య ఆరాధనగా భావిస్తే ఆజాతి మానవత్వాన్ని కోల్పోయిందని ఎందుకు అసహ్యపడరాదు? (Ibid, పే: 18,19)

## పాశ్చాత్య ప్రజాస్వామ్యం

పాశ్చాత్య నాగరికత దృష్టిలో ప్రజాస్వామ్యం అంటే ప్రజలు సార్వభౌమాధికారం కలిగి ఉండడం. అంటే ఏ ప్రదేశంలో ప్రజలు నివశిస్తుంటారో ఆ ప్రదేశంలో ప్రజల ఉమ్మడి సంకల్పం అడ్డులేని స్వేచ్ఛ. సర్వాధికారం కలిగి ఉండటం అన్నమాట. ఇంకా సూక్ష్మంగా పరిశీలిస్తే ప్రజాసంకల్పం అనేది ఒక చట్టానికి శాసనానికి కట్టుబడి ఉండదు! చట్టం ఖుద్దుగా ప్రజాసంకల్పానికి దాసోహం పలుకుతుంది. పైగా ప్రభుత్వం ప్రజల అభిమతాన్ని సాధించేందుకు తన అధికారాన్ని సంపూర్ణంగా వినియోగిస్తుంది.

ఇక ఆలోచించండి. సెక్యులరిజం ప్రజలకు దైవభయం నుండి స్వేచ్ఛ ప్రసాదించి మన్నికగల శాశ్వత విలువలకు కట్టుబడి ఉండకుండా అపరిమితముగా స్వయాన్నే ఆరాధించేటట్లు చేసింది. జాతీయతత్వం అనేది జాతిస్వార్ధం మరియు ప్రతిష్ఠ పట్ల వ్యామోహం కల్గించి అర్థంలేని ఈర్ష్యకు దారితీసి ప్రజలను మూర్ఖపరచింది. ప్రజాస్వామ్యం వచ్చి హద్దులేని, ఆశలు అభిలాషలు కల్గి స్వార్థమనే మత్తులో మునిగితేలుతున్న వారి చేతుల్లో శాసన నిర్మాణపు హక్కు పడేసింది. ఈ ప్రజాభిలాషల్ని సాధించడమే ప్రభుత్వధ్యేయమని ప్రకటించింది. సర్వస్వాతంత్ర్యం మరియు సార్వభౌమాధికారం కల ఇలాంటి జాతి ఒక గూండాకంటే ఏవిధంగా విభిన్నంకాగలదు? స్వేచ్ఛ మరియు బలంకల ఒక గూండా తన పరిధిలో ఏదయితే చేయగలుగుతాడో అలాంటిదంతా ఇలాంటి జాతీయతత్వం కల దేశం విస్తృత పరిధిలో తప్పకుండా చేస్తుంది. ఇలాంటిదేశం ఏ ఒక్కటో కాకుండా, అభివృద్ధిపొందిన దేశాలన్ని సెక్యులరిజం, నేషనలిజం డెమోక్రసీ విధానాలపై ఆధారపడి నిర్మించబడినట్లయితే ప్రపంచం తోడేళ్ళతో

నిండిన మహారణ్యంగా మారుతుంది. ఈ తోడేళ్ళు అరుస్తూ స్వైరవిహారము చేస్తూ కంటపడ్డ ప్రతివ్యక్తి పైపడి చీల్చిచెండాడుతాయి. (Ibid, పే: 19,20)

## ఉలెమాల పరిస్థితి

మతం పట్ల విశ్వాసంకల ధర్మవేత్తలు (ఉలెమాలు) చాలా వరకు చిన్న చిన్న సమస్యల్ని తీసుకుని వాటిపై వాదోపవాదాలకు దిగడం ఒక సరదాగా పాటిస్తూవచ్చారు. వీరు చిన్నచిన్న విషయాల్ని పెద్దపెద్ద సమస్యలుగా చిత్రిస్తూ ప్రధాన విషయాలను ముస్లింల దృష్టికే రానీయకుండా వాటిని విస్మరిస్తూవచ్చారు. భేదాభిప్రాయల ప్రాతిపదికగా క్రొత్త వర్గాల్ని సృష్టించి వాటిని శాశ్వత పరుస్తున్నారు. వివాదాలకు, తగవులకు ఈ వర్గాలు రంగస్థలాలయ్యాయి. ఉలెమాలు వీరి వర్గీకరణ వాదాల పరిశీలన కోసం, వాటికి వివరణలివ్వడం కోసం తమ జీవితాలనే ధారబోశారు. అంతేకాని దివ్యఖుర్ఆన్ మరియు హదీస్ పట్ల ఏ మాత్రం శ్రద్ధ చూపలేదు. ఇతరులకు కూడా వాటిపట్ల ఆసక్తి కల్గించలేకపోయారు. వీరు ధర్మశాస్త్రం పట్ల ఏ కొద్ది ఆసక్తి చూపినా అది ప్రాధాన్యం లేని కొన్ని విషయాలు వరకే పరిమితమై ఉండేది. వారి శ్రమంతా కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లుంది. వారి ప్రభావం ఎక్కడైన సోకితే అక్కడి ప్రజలు సంకుచితులయ్యారు. అల్పవిషయాలపై తీవ్రంగా ఆలోచించసాగారు. విశాల ధృక్పథం, సమగ్ర పరిశీలన వారికి అబ్బలేదు. ఈ ఉలెమాలు సృష్టించిన వివాదాలు, ప్రారంభించిన వాగ్వివాదాలు, కల్గించిన మతాంతర్భేధాలు, లేవదీసిన వర్గ పోరాటాలు మొదలైనవి ఈనాడు మనకు వారసత్వంలో సంక్రమించినటువంటివే. (ముసల్ మానోకా మాజిల్ ఓ హాల్ ఔర్ ముస్తఖ్ బిల్ కే లియె లాహాయె అమల్: 11-11-1959 ప్రసంగం, పే: 11,12)

## సూఫీల పరిస్థితి

సూఫీల పరిస్థితిని పరిశీలించండి, వారిలో కొద్ది మంది చైతన్యం కలవారు ఇస్లాం శాసనాంగాన్ని, షరీఅత్‌ని గుర్తించి వాటి ప్రకారం ఆచరించారు, వాటిని ఇతరులకు బోధించారు కూడా. కాని వారిలో చాలా మంది ఇస్లామేతర భావాల

మిశ్రమమయిన ధార్మిక ఆదేశాలను ఇతరులకు బోధించసాగారు. వీరి తత్వం అరిస్టాటిల్, మ్యూనిచియన్, జొరాష్ట్రియన్ తత్వాలతో మరియు వేదాంత తత్వాలతో కలసిన మిశ్రమ తత్వం. వీరు పాటించే పద్ధతులు యోగులు, సన్యాసులు, బైరాగులు పాటించే విధానాలకు సమానమయ్యాయి. ఫలితంగా వీరి ఉపదేశాలకు, ఇస్లాం బోధించే స్వచ్ఛమయిన విశ్వాసం, అవి కోరే ఆచరణకు ఎలాంటి సంబంధం లేకపోయింది. దైవ మార్గం చూపిస్తారని ప్రజలు ఆశతో సూఫీలవైపు మళ్ళారు. కాని వీరు ప్రజల్ని పెడమార్గం పట్టించారు. ఇలాంటి మత గురువులు వదలి వెళ్ళిన పీఠాలపై తర్వాత వచ్చిన వారు తమ పూర్వీకుల భోగభాగ్యాలనేకాక వారి శిష్యగణాన్ని కూడా వారసత్వంలో పొందారు. ఈ శిష్యులకు వారు ధర్మజ్ఞానం బోధించి సుశిక్షణ ఇవ్వడానికి మారు కేవలం శిష్యులు సమర్పించుకునే కానుకలు, నైవేద్యాలు పుచ్చుకోవడంతో మాత్రం సరిపుచ్చుకున్నారు. ఈ మతగురువులు, తమ ప్రభావం ఉన్న చోటల్లా మరియు తమ మాటచెల్లే అవకాశం ఉన్నప్పుడల్లా ఇస్లాం ధర్మం తన అసలు రూపంలో ప్రత్యక్షం కాకుండా చూడడమే వారి కృషి. ప్రజలు నిజమయిన ఇస్లాం ధర్మాన్ని తెలుసుకోకుండా ఉంటేనే తమ మాయలు, మహత్యాలూ కొనసాగుతాయని వారు గుర్తించారు. (Ibid, పే: 12,13)

## కర్తవ్యం మరచిన ముస్లింలు

ఇస్లాం అన్నది ఒక ఉద్యమం. ఒక లక్ష్యసాధన కోసం కొన్ని సిద్ధాంతాలతో ఇది ప్రారంభయయింది. ఈ విషయాన్ని నేడు ముస్లిం సమాజం విస్మరించింది. ముస్లింల తీరుతెన్నుల్ని చూస్తూ ప్రపంచం కూడా ఇస్లాం ఒక ఉద్యమం అనే విషయాన్ని గుర్తించలేకపోతోంది. ఇస్లాం ఉద్యమంలో పాలు పంచుకొంటూ పురోగమించే వారినే ముస్లిం సమాజం అని పేర్కొనడం అయింది. ఈనాడు 'ముస్లిం' అనే పేరు వాడుతున్నాం, కాని ముస్లింలు ఇస్లాం ఉద్యమాన్ని, ఉద్యమ ధ్యేయాన్ని విస్మరించారు. పైగా వీరు ఇస్లాం బోధించే సూత్రాల్ని విచ్ఛిన్నపరుస్తున్నారు. ఫలితంగా 'ముస్లిం' అనే పదం దాని ప్రాధాన్యతను పోగొట్టుకొంది. ఈ పదం ఇప్పుడు ఒక సమాజ సంబంధాన్ని మాత్రం

సూచిస్తోంది. ఇంకా చెప్పాలంటే ఇస్లాంకు వ్యతిరేకంగా ప్రవర్తించే వారు, ఇస్లాం సూత్రాల్ని భంగపరచేవారు ముస్లిం పేరుతో చలామణి అవుతున్నారు. వీరి వద్ద ఇస్లాం మచ్చుకు కూడా కనబడటం లేదు. ఇస్లాంను విస్మరించిన ముస్లింలవద్ద ఇస్లామేతర విషయాలు తప్ప మరేమీ కానరావడం లేదు.

(ముసల్మాన్ ఔర్ మౌజూద సియాసీ కష్మకష్ రెండభాగం, పే: 40,41)

## వీరంతా ముస్లింలే

ఈనాటి ముస్లింల స్థితి చాలా శోచనీయం. అటు బజారుకెళ్లి చూడండి, ముస్లిం వేశ్యలు బాల్కనీలపై నిరీక్షిస్తూ ఉండటం. వారి కోసం ముస్లిం విటులు వీధిలో సంచరిస్తూ ఉండటం మీరు చూస్తారు. జైళ్ళ వైపుకెళ్ళండి. అక్కడ మీకు ముస్లిం దొంగలు, దోపిడి గాండ్రు, హంతకులతో పరిచయం కలుగుతుంది. ప్రభుత్వ కార్యాలయాలు, న్యాయస్థానాల్లో ముస్లింలు చేసే పనులు గమనించండి. అక్కడ వారు లంచగొండితనం, మోసం, దొంగ సంతకాలు చేయడం, ప్రమాణం చేసి అసత్యం పలకడం మీరు చూడగలరు. సమాజస్థితిని చూడండి ముస్లిం త్రాగుబోతులు, ముస్లిం జూదగాండ్రు, ముస్లిం నటులు, ముస్లిం గాయకులు, వాయిద్యగాండ్రు, మీకగుపడతారు. 'ముస్లిం' అనే పదం ఎంత నీచస్థితికి దిగజార్చబడింది! ఎలాంటి తుచ్ఛగుణాలు "ముస్లిం"పదంతో కలిపి వాడబడుతున్నాయి !!

ప్రపంచమంతటా వ్యాపించి ఉన్న అవినీతిని నిర్మూలించడానికి ఇస్లామీయ ఉద్యమం ప్రారంభమయింది. "ముస్లిం"పేరిట సద్వర్తనులయిన వ్యక్తులు ఒక సంఘటిత సమాజం (జమాఅత్) గా పరిపాలన వ్యవస్థ రూపంలో ఏకమయ్యారు. వీరు అత్యుత్తమ నైతిక ప్రమాణాన్ని నెలకొల్పారు. నైతిక సంస్కరణకు ఆదర్శప్రాయులయ్యారు. అవినీతి, అన్యాయాలను తొలగించి సమాజాన్ని చైతన్యవంతం చేసేందుకు ఆ "జమాఅత్" కఠిన శిక్షాస్మృతిని అమలు పరిచింది. ఎవరైతే వ్యభిచారాన్ని నిర్మూలించదలచి జమాఅత్‌గా రూపొందారో వారిలో ఒక వ్యభిచారి అయినా లేకుండేందుకు; ఎవరైతే మద్యపాన నిషేధానికి కంకణం కట్టుకున్నారో వారిలో ఒక త్రాగుబోతు కూడా లేకుండేందుకు, రాళ్ళతో

కొట్టి ప్రాణాలు తీయడం, చర్మం చిట్లి పోయేలా బాదడం, శిరచ్ఛేదం చేయడంలాంటి కఠిన శిక్షలు ప్రవేశపెట్టారు.

ఉన్నత శ్రేణికి చెందిన నీతిమంతుల్ని ఎన్నుకుని, క్రమశిక్షణగల సంస్థగా రూపొందించి కఠిన శిక్షల్ని అమలుపరుస్తూ ఇస్లామీయ ఉద్యమాన్ని ప్రారంభించిన వారిలో వ్యభిచారులు, దొంగలు, మోసగాండ్రు మరియు కుంటునడక కలవారు ప్రవేశించడం. ముస్లింల పేరుతో చెలామణి కావడం "ముస్లిం" అనే పదానికి అర్థం లేకుండా చేయడమే. ఇలాంటి దుర్దశకు చేరిన తర్వాత "ఇస్లాం"మరియు "ముసల్మాన్" లకు గౌరవ మర్యాదలు సమకూరాలంటే ఎలా సాధ్యమౌతుంది? ముస్లింలను చూడాలనే కాంక్ష ప్రజలలో ఎలా కలుగుతుంది. ముస్లింల గౌరవం మంట కలిసినప్పుడు వారి వ్యక్తిత్వం దెబ్బతిన్నప్పుడు, వారికి నడి వీధిలో పరాభవం కలిగినప్పుడు కాపాడటానికి ఎవరైనా ముందుకు రావడం మనం చూస్తున్నామా? (Ibid, పే: 41-43)

## దిగజారిపోయిన ముస్లిం సమాజం

ఉన్నత విద్య అభ్యసించిన ముస్లిం వర్గాల పరిస్థితులు మరింత శోచనీయంగా ఉన్నాయి. వారి అభిప్రాయంలో ఇస్లాం అనేది కేవలం ఒక జాతీయతత్వమే. ఒక వ్యక్తికి ఇస్లాం మరియు ఇస్లాం జీవిత విధానంతో ఎలాంటి సంబంధం లేకున్నప్పటికి, అతను ముస్లిం కుటుంబంలో జన్మించడం వల్ల "ముస్లిం" అనబడుతున్నాడు. ముస్లిం సమాజ పరిస్థితుల్ని పరిశీలించినట్లయితే రకరకాల ముస్లింలు మనకగుపడుతారు. దైవం, ప్రవక్తలు మరియు మరణానంతర జీవితంపట్ల ఏ మాత్రం విశ్వాసం లేకున్నప్పటికీ, ఇతర భౌతిక విధానాల పట్ల సంపూర్ణ విశ్వాసం కల్గి ఉన్న ఆ వ్యక్తి ముస్లింగా చలామణి అవుతున్నాడు. ఒక వ్యక్తి వడ్డీ ద్వారా ధనార్జనకు పాల్పడుతూ, జకాతు చెల్లించాలనే ధ్యాస కూడా లేనప్పటికి, అతను ముస్లింగానే పిలువబడుతున్నాడు. మరో గౌరవనీయుడైన వ్యక్తి తన భార్యను, కూతుర్ని బజార్లో తిప్పుతూ వారి సౌందర్యాన్ని పదర్శింపజేస్తూ సినిమాలకు తీసికెళ్ళినా, (ఇప్పటి పరిస్థితుల్లో టి.వి.ని చూపిస్తూ

నైటు క్లబ్బుకు తీసికెళ్ళినా) కూతుళ్ళను వాయిలన్ వాయించేందుకు, డ్యాన్స్ చేసేందుకు అలవాటు చేసినా ఆ వ్యక్తి ముస్లిం పేరుతోనే సమాజంలో వినుతికెక్కుతాడు.

సంఘ నాయకుడుగా పిలువబడే మరో పెద్ద మనిషి దైవారాధనల్ని, హజ్, జకాత్ విధానాల్ని నిరుపయోగమైన విధులుగా భావిస్తూ; మద్యపానం, వ్యభిచారం, లంచగొండితనం, జూదం లాంటి వాటిని మాత్రం ధర్మసమ్మతమైన విషయాలని అనుకుంటాడు. హరాం (అధర్మవస్తువు)ఏదో హలాల్ (ధర్మసమ్మతమైంది) ఏదో తెలుసుకోవాలనే కుతూహలం కూడా అతనిలో ఉండదు. జీవితాంతం అలాంటి వ్యక్తి దైవాజ్ఞల ప్రస్తావనే చేయడు. అతని మాటల్ని చేతల్నిబట్టి చూస్తే అతనికి అవిశ్వాసి లేదా బహుదైవారాధకునికి మధ్య ఎలాంటి భేదం కనబడదు, అయినప్పటికీ అతను ముస్లింగానే పరిగణించబడుతున్నాడు. ఈనాడు ముస్లింగా పరిగణించబడుతున్న సమాజాన్ని పరిశీలించినట్లయితే రకరకాల వింత వ్యక్తులు లెక్కలేనన్ని "ముస్లిం" బ్రాండ్లతో మనకు గోచరిస్తారు. ఇదొక పక్షుల గూడులా ఉంది. ఇందులో కాకులు, గ్రద్దలు, రాబందుల వంటి భయంకర విహంగాలు అనేకం నివసి స్తున్నాయి. గూళ్ళలో నివసించడం వల్ల ఇవన్నీ పక్షులే అనబడతాయి కదా! (Ibid, పే: 43,44)

## చెడుకు మూలం

ప్రపంచంలో చెడు ఎక్కడున్నా సరే, దానికి కారణం ఒక్కటే, అది, దైవాన్ని వదలి ఇతరుల్ని ప్రభువుగా, స్వామిగా అంగీకరించడమే. ఈ అంగీకారమే సమస్త అలజడులకు ఆలవాలమైన చెడుకు మూలం. దీనికి పుట్టిన చెట్టు తన కొమ్మల్ని రెమ్మల్ని ఎంతో దూరం వరకు విస్తరింపజేస్తుంది. విషంతో నిండిన ఫలాన్ని ప్రజలకందిస్తుంది. వారిని విషమయంచేస్తుంది. ఈ వృక్షానికి మూలం ఉన్నంత వరకు, మీరు ఎన్ని కొమ్మల్ని నరికినా, ఎన్ని రెమ్మల్ని పెరగనివ్వకుండా చేసినా, ఫలితం ఒక్కటే. ఒక వైపు నుండి బాధలు, విపరీత పరిణామాలు అంతమౌతూవస్తే, మరో వైపు నుండి అవి మరింత ఉధృతంగా వ్యాపిస్తూ ఉంటాయి. (Ibid, పే: 114)

## దైవానికి సాటి కల్పించే వారంటే ఎవరు?

దైవానికి సాటి కల్పించే వారంటే ఎవరు? ఎవరైతే తమ వ్యక్తిగత జీవితాల్లో, సామూహిక జీవన రంగాలలో దైవం పట్ల వినయ విధేయతలు ప్రకటించడంతో పాటు దైవానికి అవిధేయత చూపిస్తూ , దైవేతరుల్ని విధేయిస్తూ ఉంటారో వారే దైవానికి సాటి కల్పించేవారు. అల్లాహ్ నియమించిన ప్రకృతి చట్టానికి సంబంధించినంత వరకూ ప్రతి మానవుడు, తాను తలచిన, తలచకున్నా, విధిగా దాన్ని పాటించాల్సిదే, అలా చెయ్యడం అతనికి తప్పదు కూడా. కాని మనిషి స్వతంత్రంగ ప్రవర్తించేందుకు ఎక్కడైతే సాధ్యమౌతుందో, ఆ పరిధిలో కొందరు దైవాన్ని వదిలి ఇతర శక్తులకు దాస్యం చేస్తున్నారు. మరి కొందరు తమ జీవితాన్ని అనేక రంగాలలో విభజించి కొన్ని రంగాలలో దైవ నియమాలను (షరియత్ చట్టాల్ని) పాటిస్తూ మరికొన్ని రంగాలలో తమ కోరికలకు లేదా ఇతరులకు బానిసలై మెలగుతున్నారు. ఈ వైఖరే దైవంతో పాటు ఇతరుల పట్ల విధేయత ప్రకటించడం అనబడుతుంది. అలాంటి వారే దైవానికి సాటి కల్పించే వారు, బహుదైవా రాధకులూనూ. (Ibid, పే: 154)

## ముస్లిం జాతుల బలహీనతకు కారణాలు

నా దృష్టిలో మొట్టమొదటి మౌలిక లోపం ఏమిటంటే; శతాబ్దాల తరబడి నెలకొన్న పతనం వల్ల ముస్లిముల నైతిక మూలాధారాలు పట్టును కోల్పోయాయి. అలాంటి ముస్లిముల్లో మనం జన్మించాం. మార్పులు లేని నిర్ణయాలు ధృడ సంకల్పం, నిశ్చిత ఆశయాలు, నమ్మదగిన వాగ్దానాలు మొదలగు వాటికి సంబంధించిన మన ప్రవర్తనా శక్తి క్షీణించింది. వీరిలో ఒక వింతైన బలహీనత ఆవిర్భవించింది. వీరు ఒక విషయాన్ని సత్యమని తెలుసుకుంటారు. దాన్ని హృదయపూర్వకంగా అంగీకరిస్తారు కూడా. అయితే దాని కోసం ఏ మాత్రం త్యాగం చేయడానికి వీరు ఒప్పుకోరు. తమ శక్తి సామర్థ్యాలను వస్తుసామాగ్రిని, తమకు ప్రియమైన భావాల్ని, ఇస్లామేతర వాంఛల్ని కోరికల్ని వినోదాల్ని ఇంకే వస్తువునైనా సరే, త్యాగం చేసి నమ్మిన సత్యానికి అనుగుణంగా ప్రవర్తించడానికి సిద్ధంగా లేరు. సత్యాన్ని అంగీకరిస్తారు, తమ నమ్మకాన్ని గురించి బాహాటంగా ప్రస్తావిస్తారు, దాన్ని శ్లాఘిస్తూ ఎన్ని పుస్తకాలనైనా రచిస్తారు.

కొన్ని బూటకపు పనులు కూడా చేసి చూపిస్తారు. ఆ తర్వాత వారి కార్యకలాపాల్లో, వారి సంస్థల్లో, వారి జీవితపు అన్ని వ్యవహారాలలో నమ్మిన సత్యానికి వ్యతిరేకంగా ప్రవర్తించటానికి హక్కు కావాలంటారు. ఇస్లాంకు మరియు మార్గ భ్రష్టతకు మధ్య ఒక రాజీ ఒప్పందాన్ని కుదుర్చుకునే మత ధోరణికి గురవుతారు. ఇస్లాంకు మరియు ధర్మ నిరాకరణకు, సత్యానికి మరియు అసత్యానికి, వినయ విధేయతలకు మరియు అహంకారం అవిధేయతలకు మధ్య సందేహాలకు గురవకుండా, సందిగ్ధావస్థకు గురవకుండా ఉండాలని ఏదో ఒక్క మార్గాన్నే పాటించమని ధర్మం వీరిని బోధిస్తూంది. ఈ బోధన వీరికి భరించరానిదిగా తయారయింది. (రుదాద్,జమాఅత్ ఇస్లామీ, 2వ భాగం, పే:17,18)

ఇస్లాంను మనఃపూర్వకంగా అంగీకరించి ధర్మ నిష్ఠతో జీవితం గడిపే వారి పరిస్థితి కూడా శోచనీయంగానే ఉంది. వృత్తిగా పాటించబడే కపట మత పద్ధతులకు మరియు వాస్తవమైన ధర్మనిష్ఠతకు మధ్య ఉన్న వ్యత్యాసాన్ని వీరు గ్రహించలేక పోతున్నారు. వాస్తవమైన ధార్మిక విలువల్ని వీరు ఇతర విలువల్లోకి మార్చుకోవడమో లేదా వాటి విషయంలో అయోమయ పరిస్థితుల్లో పడి పోవడమో జరిగింది. ఏ విషయాలైతే అసాధరణ ప్రాముఖ్యత కలిగి ఉన్నాయో లేదా విశ్వాసంలో మౌలికమయిన ఆధారాలుగా ఎంచ బడుతున్నాయో వాటికి వీరు నామమాత్రపు ప్రాముఖ్యత నివ్వడం జరుగుతూంది. ఏండ్ల తరబడి ప్రచారంలో ఉంటూ వీరి ఆలోచనలలో మార్పు కల్గించిన కపట ధర్మ విధానమే దీనికి కారణం. మతపరమైన వృత్తులవల్ల, మత కళాకారుల పనులవల్ల వీరు ఇస్లాంలో ఎలాంటి ప్రాముఖ్యత లేని విషయాలకు ఇంకా ఇతరత్రా కేవలం దోహదపడే విషయాలకు అమిత ప్రాముఖ్యతనిస్తూ వచ్చారు.

పండితులు కానీవండి, పామరులు కానీవండి, ఇంకెవరైనా కానీవండి, అల్లాహ్ సూచించిన ధర్మంలో ఏఏ వస్తువులకు ఎంత ప్రాముఖ్యత ఉంది, అవి ఎంత వరకు పాటించయోగ్యమైనవి, ఏవస్తువును స్వీకరించాలి, ఏ వస్తువును విడచిపెట్టాలి అనే విషయాన్ని గ్రహించే సూక్ష్మజ్ఞానం వీరిలో లేదనే చెప్పవచ్చు. (Ibid, పే: 20)

# రెండవ భాగం

## రండి ఇస్లాం విప్లవ బావుటా ఎగురవేద్దాం!

"ఓ విశ్వాసులారా! మీరు ఇస్లాంలో పూర్తిగా ప్రవేశించండి."
(అల్ ఖుర్ఆన్ 2 : 208)

"ఇక నుండి ప్రపంచంలో మానవులకు మార్గం చూపడానికి, వారిని సంస్కరించడానికి రంగంలోకి తీసుకురాబడిన ఉత్తమ సమాజం మీరే. మీరు మంచి పనులు చేయ్యండని ఆదేశిస్తారు, చెడు పనుల నుండి నిరోధిస్తారు. అల్లాహ్‌ను విశ్వసిస్తారు." (దివ్యఖుర్ఆన్ 3 : 110)

"అల్లాహ్ మీ రూపురేఖల్ని, మీ సిరిసంపదల్ని చూడడు, ఆయన మీ హృదయాలను, మీ పనులను చూస్తాడు." (ముస్లిం, ఇబ్నె మఅజ)

"ఎవరైతే జిహాద్ చేయకుండా, జిహాద్ చేయాలన్న తలంపుకూడా లేకుండా మరణిస్తాడో ఆ వ్యక్తి మరణం కపట విశ్వాసి మరణమవుతుంది."
(ముస్లిం)

## ముస్లిం నిజధ్యేయం

ఇస్లామీయ ఉద్యమం నా జీవితధ్యేయం. ఈ ధ్యేయసాధన కోసమే నా జీవితాన్ని ధారపోస్తున్నాను. ఈ లక్ష్యం కోసమే నేను మరణిస్తాను. ఇతరులు ఈ పంథాను పాటించవచ్చు లేదా నిరాకరించవచ్చు. ఏది ఏమైనా ఎలాంటి పరిస్థితుల్లోనూ నా నిర్ణయంలో మాత్రం మార్పులేదు. ఇస్లామీయ ఉద్యమ మార్గంలో నా జీవిత సర్వస్వాన్ని అర్పించేందుకు నేను నిశ్చయించుకున్నాను. ఏ ఒక్క వ్యక్తి కూడా ముందడుగు వేసి, నా నిశ్చిత మార్గాన్ని పాటించకపోయినప్పటికీ, నేను మాత్రం ఈ మార్గాన్ని వీడను. ఈ విషయంలో ఎవరి సహాయ సహకారాలు లేకున్నాపరవా లేదు, నేను ఒంటరిగానే ఈ మార్గంలో ప్రయాణం చేస్తాను. యావత్ప్రపంచం ఏకమయి నన్నెదిరించినా,

నేను ఎలాంటి జంకులేకుండా పరిపూర్ణమైన హృదయ సంతృప్తితో ఇస్లామీయ ఉద్యమాన్నే అనుసరిస్తాను.

(రూదాద్, జమాఅతె ఇస్లామీ, 1వ భాగం, పేజ్ 19)

## రండి! ఈ ప్రపంచాన్ని మారుద్దాం!

ఈ విధంగా నేను నిజమైన ముస్లింగా మారాను. క్షుణ్ణంగా పరిశీలించి, అవగాహన చేసుకొని ఇస్లాం విధానాన్ని పాటిస్తున్నా. ముక్తికోసం, శాంతికోసం ఇస్లాం తప్ప మరో మార్గంలేదని హృదయపూర్వకంగా విశ్వసించాను. ముస్లిమేతరులనే కాకుండా, ముస్లిములను కూడా ఇస్లాం వైపు ఆహ్వానిస్తున్నా. కాని నా ఆహ్వానం ప్రస్తుత ముస్లిం సమాజాన్ని యథాతథంగా సాగనివ్వడానికి కాదు. ప్రస్తుత ముస్లిం సమాజం ఇస్లాం సూచించే మార్గం నుండి దూరమయింది. దారి తప్పి నడుస్తుంది. నా ఆహ్వానం : రండి! విశ్వవ్యాపితంగా ఉన్న దౌర్జన్యాన్ని, అంధకారాన్ని తుదముట్టిస్తాద్దాం. మనిషిపై మనిషి సాగిస్తున్న పెత్తనాన్ని సమూలంగా తొలగిద్దాం. దివ్యఖుర్ఆన్ సూత్రాలననుసరిస్తూ మరో నూతన ప్రపంచాన్ని నిర్మిద్దాం, అందులో మానవత్వం సరైన విలువ, స్థానం కలిగి ఉండాలి. మానవులు గౌరవం, స్వేచ్ఛ, సమానత్వం, న్యాయం, సౌభ్రాతృత్వాలతో జీవించాలి."

(ముసల్మాన్ ఔర్ మవూజుదా సియాసీ కష్మకష్, 1939, 3వ భాగం, పే: 28)

## దైవహితవుల్ని మీరేం చేశారు?

అల్లాహ్ ప్రవక్త ద్వారా ఏ శ్రేయస్కరమార్గం మీకు అందజెయ్యబడిందో, దేనివల్ల మీరు ఈనాడు ముస్లింలుగా పరిగణించబడుతున్నారో, ఇంకా, మీరు అంగీకరించినా, అంగీకరించకపోయినా, దేనివల్ల ఇస్లాం ప్రతినిధులుగా మిమ్మల్ని ప్రపంచం గుర్తిస్తుందో, దానిపట్ల మీ వైఖరి ఎలా ఉందో అలాగే మీ వర్తమానం, భవిష్యత్తులుంటాయని తెలుసుకోండి.

(షహాదతె హఖ్ : పేజ్: 21, 30-12-1946)

## మూలాధారం కాగల దృక్పథం

మానవుడు అసలు ఎవరు? అతని స్థానం ఏమిటి? ఈ విశ్వంలో అతని పాత్రేమిటి? ఈ విశ్వం ఏ సిద్ధాంతాలపై ఆధారపడి పని చేస్తోంది? మానవ జీవితం ఏ నియమాల ప్రకారం నడవాలి? అనే ప్రశ్నలకు ఇవ్వబడే సమాధానాలు, అవి ఏవయినా సరే, నైతిక దృక్పథానికి మూలధారాలౌతాయి. జీవితంలోని వివిధ రంగాల్లో మనిషి అనుసరించే విధానం, ఈ దృక్పథం ఆధారంగానే రూపొందుతుంది. వ్యక్తిగత నడవడిక, ప్రవర్తన, సామాజిక సంబంధాలు, నిత్యజీవిత వ్యవహారాలు, చివరకు నాగరికత రూపు రేఖలు వాటి వివరాలతో సహా, ఈ విధానంలోనే రూపొందుతాయి.

(తజ్దీద్-ఓ-అహ్యా: ఎ-దీన్, పే: 13,14)

## ఇహలోక జీవితం

ప్రాపంచిక జీవితం పరీక్షా కాలం. ఇక్కడి పనులకు శిక్షగాని బహుమానం గాని ఇక్కడే ఇవ్వబడదు. మనిషికి ఇహంలో లభించే బహుమానం అతను చేసిన మంచి పనుల ప్రతిఫలం కాదు. అతను ఇంకా ఎక్కువగా పరీక్షింపబడేందుకు ఇవ్వబడింది మాత్రమే, అలాగే ఇక్కడ సంభవిచే ఇడుమలు, ఇక్కట్లు, ప్రమాదాలు మరియు విపరీత పరిణామాలు, మనిషి చేసిన చెడుకు అతనికి ఇవ్వబడ్డ శిక్షలు కావు. ఇవన్నీ ప్రకృతి సిద్ధాంతాల పర్యవసానంగా ఉత్పన్నమయ్యే పరిణామాలు, ఫలితాలు మాత్రమే. ఇవి సృష్టి విధానంలో ఒక భాగం. వీటిపై మనిషికి అదుపు, అధీనం ఏ మాత్రం లేదు. మనిషి చేసిన పనులకు లెక్క చెప్పుకోవడం, ఆ పనుల పరిశీలన వాటిపై తీర్పు అనేవి ఈ జీవనానంతరమే జరుగుతాయి. దీన్నే పరలోక జీవితం అంటారు. అందుచేత ఈ ప్రాపంచిక జీవితంలో కనిపించే పర్యవసానాలు మరియు ఫలితాలు, ఒక పని మంచిదని, లేక చెడ్డదని, స్వీకరింప తగినదని, లేక నిరసింప తగినదని నిర్ణయించడానికి ప్రమాణాలు కాజాలవు. అసలు ప్రమాణం, పరలోకంలో సంభవించే ప్రతిఫలాలు మాత్రమే. మరణానంతర జీవితంలో ఏ పనులు మంచి ప్రతిఫలాన్నిస్తాయి, ఏ కర్మలు దుష్ఫలితాలనిస్తాయి అనే విషయాన్ని

తెలుసుకోవడానికి ఏకైక మార్గం అత్యున్నతుడయిన ప్రభువు అల్లాహ్ తన ప్రవక్తద్వారా మానవాళి కోసం అవతరింపజేసిన దైవవాణి (వహి) మాత్రమే. (Ibid, పే: 29,30)

## దైవ ప్రవక్తల లక్ష్యం

అల్లాహ్ అవతరింపజేసిన ప్రవక్తల చివరి లక్ష్యం దైవ ధర్మాన్ని సంస్థాపించి సంపూర్ణ మానవ జీవిత విధానాన్ని తదనుగుణంగా మలచడమే. అవిశ్వాసుల్ని, అంధకార బంధురమైన వారి విధానాన్ని దైవ ప్రవక్తలు సహించేవారు. కాని అలాంటి వారి చర్యలు వారి వరకే పరిమితమై ఉండేలా చూసేవారు. అధికారం, పరిపాలన అవిశ్వాసుల చేతుల్లో ఉంచడానికి ప్రవక్తలు అంగీకరించేవారు కారు. అధికార బలం పుంజుకొంటూ మానవ వ్యవహారాల్ని చీకటి యుగపు చట్టాల ప్రకారం నడిపేందుకు అవిశ్వాసులకు అవకాశాన్ని ఇవ్వకుండా చేయడమనేది విశ్వాసుల స్వాభావికమైన విషయం.

ప్రపంచంలోకి వచ్చిన ప్రతి ప్రవక్త రాజకీయ విప్లవాన్ని సాధించేందుకు ప్రయత్నించాడు. హజ్రత్ ఇబ్రాహీం (అలై) లాంటి ప్రవక్తల ప్రయత్నం ఈ విప్లవానికి మార్గం ఏర్పరచేంత వరకే పరిమితమైంది. హజ్రత్ ఈసా (జీసస్-అలై) లాంటి ప్రవక్తలు ఈ విప్లవాన్ని ప్రారంభించారు. కాని దైవ శాసనం అమలులో రాకముందే వారి ఉద్యమం అంతం అయింది. మరికొందరు ప్రవక్తలు ఈ విప్లవాన్ని విజయవంతంగా సాధించారు. అలాంటి వారిలో హజ్రత్ యూసుఫ్, హజ్రత్ మూసా, హజ్రత్ సయ్యిదినా ముహమ్మద్ (అలైహిస్సలాం) ఉన్నారు. (Ibid, పే: 34)

## మా ఉద్దేశ్యం

ఇస్లాం పునఃస్థాపనమే మా లక్ష్యం. ఆధునిక విజ్ఞాన శాస్త్రానికి గాని, సాంకేతిక అభివృద్ధికి గాని మేము వ్యతిరేకులం కాము. పాశ్చాత్య జీవిత విధానాన్ననుసరించి ఏర్పడిన నాగరికత, సంస్కృతులకు ఆ పద్ధతుల ఆధారంగా రూపొందించబడిన నైతిక విధానానికి మేము వ్యతిరేకులం. స్వల్పమయిన ప్రవేశ

రుసుములు వసూలు చేస్తూ హెచ్చు తగ్గు తరగతుల సభ్యులను చేర్చుకుంటూ రాజకీయనాటక మాడటం మా అభిమతం కాదు. ఆణిముత్యాల్లాంటి వ్యక్తుల్ని ఎన్నుకోవడం వారిని సుశిక్షుతులుగా చెయ్యడం. వారిలో పురోగమించే ఉత్సాహాన్ని పురికొలుపుతూ ఆధునికత పేరిట ప్రవేశపెట్టబడే నీతి బాహ్యమయిన పనుల్ని నిరోధిస్తూ, దైవ గ్రంధమైన దివ్యఖురాను మరియు మహాప్రవక్త ఆదేశానుసారం ఇస్లాం ఔన్నత్యాన్ని పునరుద్ధరించడానికి కృషి చేయడమే మా పరమావధి. జీవితంలోని కొన్ని విషయాల్ని మాత్రం తీసుకొని వాటికి ఇస్లాం రంగును పూయడం మా ఆశయం కాదు. సంపూర్ణ జీవితంలో ఇస్లాం ఔన్నత్యాన్ని సాధించడమే మా ప్రయత్నం. ఇస్లాం విద్యాసంస్థల్ని నడిపించాలి. పరిపాలనా యంత్రాంగంలో ఇస్లాం సర్వత్రా అత్యున్నత పాత్రవహించాలి. ధనం, ఉత్పత్తిలోగాని, పంపిణీలో గాని ఇస్లాం ఆదేశానుసారం ఉండాలి. విశ్వాన్ని సృష్టించిన దైవం ఏ జీవిత విధానాన్ని నిర్ణయించాడో ఆ జీవిత విధానానికి సంబంధించిన ఆధ్యాత్మిక, నైతిక, భౌతిక లాభాలు మనిషి అనుభవించేటట్లు చూడాలి. అప్పుడే విశ్వకల్యాణం సాధ్యమౌతుంది.
(ముసల్‌మానో కా మాజి ఓ హాల్ ఔర్ ముస్తఖ్‌బిల్‌కే లియె లాహో అమల్, పేజ్: 64,65)

## సకల జీవనరంగాల్లో ఇస్లాం చొచ్చుకుపోవాలంటే...

ఏండ్లతరబడి బలవంతంగా ఇస్లాంలో చొచ్చుకొనివచ్చిన ఇస్లామేతర సంప్రదాయాల్ని వడబోసి వేరుచేయాల్సి ఉంది. ఇలా కరుడుగట్టిన పాత విషయాలను వేరు చేశాక ఇస్లాంలో ఉన్న స్వచ్ఛమయిన సారాంశాన్నే గ్రహించాలి. ఇది దివ్యఖుఅన్ మరియు మహాప్రవక్త (సఅసం) ప్రవచనాల పరిమళాన్ని వెదజల్లుతుంది. ఇది అంత సులువైన పనికాదు. కొన్ని ప్రత్యర్థి వర్గాలు పాత సంప్రదాయాలకు, మూఢత్వానికి పెనవేసుకొని ఉన్నాయి. అందుచేత స్వచ్ఛమయిన ఇస్లాం పరిమళాన్ని పొందాలంటే ఈ ప్రత్యర్థి వర్గాల్ని ఎదుర్కొననిదే సాధ్యంకాదు.

మరోపనికూడా చేయాలి. పాశ్చాత్య దేశాలు సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా పురోభివృద్ధిని సాధించాయంటే అందుకు కల వాస్తవకారణాలను తెలుసుకోవాలి. పాశ్చాత్య జీవనతత్వాన్ని, వారి ఆలోచన తీరుతెన్నుల్ని, సామాజిక నైతిక భ్రష్టత్వాన్ని మన మధ్య మచ్చుకు కూడా కానరాకుండా చేయాలి. ఎవరయితే పాశ్చాత్య పద్ధతులపై, పాశ్చాత్య ముద్రపడిన ఇస్లాంపై విశ్వాసం కలిగి ఉంటారో వారికి ఈ పనంటే గిట్టదు.

ఇంకా ఇస్లామీయ దృక్పథం, సృజనాత్మకశక్తి, రుజువర్తనం. నిష్కపటం, నైతికత, ధృఢసంకల్పం కల వ్యక్తుల్ని ఏరి వారందరిని ఒక సంస్థగా సమాయత్త పరచాలి. ఇలాంటి వ్యక్తులు బహుస్వల్పంగా, అక్కడక్కడ మాత్రమే ఉంటారు. రాజకీయ, ఆర్థిక ఒడిదుడుకుల్ని ఎదుర్కొంటూ, సమాజ అపహాస్యాన్ని భరిస్తూ, సహనంతో, శాంతస్వభావంతో మసలుకొనే ఆణిముత్యాలు మనకు కావాలి.

## ఇస్లాం ఏ ఒక్కరి సొత్తూ కాదు

మనధ్యేయం ముస్లిం ప్రభుత్వస్థాపనకాదు, ఇస్లాం ఆదేశించే జీవిత వ్యవస్థ స్థాపన. నీతి నిజాయితీలతోబాటు అత్యున్నత పౌర మనస్తత్వంకల అంతర్జాతీయ విధానాలను ప్రసాదించగల ఇస్లాం వ్యవస్థ. ఇలాంటి ఇస్లాం ఏ ఒక్కరి సొత్తూ కాదు. వారసత్వంలో సంక్రమించిన ఏ ఒక్కరి ఆస్తి కూడా కాదు. ఇది ఎవరితోను ప్రత్యేక సంబంధాలు కలిగి లేదు. ఎవరైతే దీన్ని త్రికరణశుద్ధిగా నమ్ముతూ దీని ఆదేశాల్ని తు.చ. తప్పకుండా పాటిస్తారో వారే ఇస్లాం మార్గదర్శకులుగ పరిగణించబడతారు. ఎలాంటి కుటుంబములో పుట్టినా, ఎంత నీచ వంశానికి చెందినా, ఇస్లాంను పాటించే వ్యక్తి మహా ప్రవక్త (సఅసం) తరువాత వచ్చిన ఖలీఫాల అంతటి స్థానాన్ని పొందేందుకు అర్హుడౌతాడు. అతను నీగ్రోబానిస అయినప్పటికీ, ఉన్నత వంశస్థులకు సయితం ఇమాం (నాయకుడు) కాగలడు. అరబ్బులు మరియు అరబ్బేతర్లకు చెందిన ఉన్నత సమాజానికి కూడా అధినేత కాగలడు. దీనికి విరుద్ధంగా 1350 సంవత్సరాల నుండి ముస్లింకుటుంబానికి చెందుతూ వచ్చినప్పటికి, ఇస్లాం సిద్ధాంతాల్ని త్రోసిపుచ్చితే

మాత్రం వారు ముస్లింలుగా చలామణిఅయ్యే అర్హతను కోల్పోవలసి ఉంటుంది. నిన్న మొన్నటిదాకా ఒకవ్యక్తి హిందువుడిగా, క్రైస్తవుడుగ లేక పారశీకుడుగా ఉండి విగ్రహారాధనచేస్తూ, మద్యపానాన్ని సేవిస్తూ జూదం ఆడుతూ వడ్డీవ్యాపారములో మునిగి ఉన్నా సరే, ఈ రోజు ఇస్లాం స్వీకరించి, దాని సహజ విలువల్ని అర్థం చేసుకొని, తదనుగుణంగా నడుచుకోవడం ప్రారంభించ గానే అతను ఇస్లాం పరిధిలో అసాధారణ గౌరవోన్నతుల్ని పొందేందుకు అర్హుడౌతాడు. (ముసల్‌మాన్ ఔర్ మౌజుదా సియాసీ కష్మకష్, 3వ భాగం, పే: 22)

## జమాఅతె ఇస్లామి ప్రవేశ రుసుం

జమాఅతె ఇస్లామీ వల్ల ప్రభావితులై ఈ సంస్థలో చేరదలచే వారి నుండి మేము కోరేదేమిటో తెలియపరుస్తాను. ఒక ముస్లిం నుండి ఇస్లాం ఏ విషయాన్నైతే కోరుతుందో అదే మేము వారి నుండి కోరుతున్నాం. ఇస్లాం కోరే విషయాలకు ఇసుమంత కూడా ఎక్కువ చేయడంకాని వాటి నుండి తగ్గించడం కాని మావల్ల సాధ్యపడదు. ప్రతివ్యక్తి ఎదుట ఇస్లాం సంపూర్ణస్వరూపాన్ని ఉంచడమే మా కర్తవ్యం. ఇక ఈ విశ్వాసాన్ని అవగాహన చేసుకుని మెలకువతో అంగీకరించడం అది విన్నవారి కర్తవ్యం. ఈ విశ్వాసాన్ని అంగీకరించడం వల్ల అతనిపై మోపబడే విధులు అర్థం చేసుకొని త్రికరణశుద్ధితో వాటిని నిర్వహించమని మేము అతన్ని కోరుతున్నాం. ఇస్లాం నిర్ణయించిన చట్టానికి, ధర్మానికి వ్యతిరేకంగా ఉండే సమస్తభావాల్ని, విషయాల్ని, చర్యల్ని అతని మస్తిష్కంనుండి తొలగిపోవాలని, మనిషి తన ప్రతి చర్యద్వారా ఇస్లాం ధర్మానికి సాక్ష్యమివ్వాలని మేము కోరుతున్నాం. ఈ నిబంధనలే మా సంస్థ సభ్యత్వానికి ప్రవేశరుసుం మరియు ప్రవర్తనా నియమావళి కూడా. మా సంస్థ కార్యకలాపాలు మా పిలుపు బహిరంగంగానే ఉన్నాయి. ఏ విషయాన్ని కూడా మేము మరుగుపరచడం లేదు. జాగ్రత్తగా పరిశీలించినట్లయితే దివ్యఖుర్‌ఆన్, మహాప్రవక్త (సఅసం) ప్రవచనాల ఆధారంగా ఉన్న ఇస్లాంలో మేము ఎలాంటి మార్పులు చేర్పులు చేయలేదని మీరే గ్రహించగలరు. ఖుర్‌ఆన్ హితువులకు, మహాప్రవక్త (సఅసం) సంప్రదాయాలకు మేము ఇతర విషయాలు స్వయంగా

చేర్చామని ఎవరైన రుజువుపరచినట్లయితే దాన్ని వెంటనే మేము వదిలేస్తాం. అలాగే ఇస్లాంలో అంతర్భాగంగా ఉన్న ఏ విషయాన్నైనా మేము పాటించడంలేదని ఎత్తి చూపిస్తే దాన్ని పాటించడానిక్కూడా మేము సిద్ధమే. మా ధ్యేయం ఇస్లాం ధర్మ సంస్థాపనం, దానికి సాక్ష్యమివ్వడం. (షహదత్ యే హఖ్, పే:30)

## సత్యధర్మం బోధించే సిద్ధాంతాలకు మీరు ఆదర్శవంతులు కండి

మనం సత్యం అనే భావించే సూత్రాలను చేతల ద్వారా మనం మన జీవితాల్లో అభివ్యక్తం చెయ్యాలి. ప్రపంచం కేవలం మననోటితో వాటి సత్యత ప్రస్తావన వినడం మాత్రమే కాదు, మన జీవితాల్లో వాటి ద్వారా ఏర్పడే మంచినీ, శుభాలనూ తన కళ్ళతో చూడాలి. విశ్వాసంలోని మాధుర్యం వల్ల మనిషి ప్రవర్తనలల్లో, వ్యవహారాల్లో పుట్టుకు వచ్చే తీయదానాన్నిప్రపంచం మన నడవడిలో ఆస్వాదించాలి. ఈ ధర్మం మార్గదర్శకత్వంలో ఎలాంటి ఉత్తమ వ్యక్తులు తయారవుతారో, ఎలాంటి న్యాయశీలమయిన సంఘం ఏర్పడుతుందో, ఎలాంటి సత్సమాజం ఉనికిలోకి వస్తుందో, ఎలాంటి పరిశుద్ధమయిన, పవిత్రమయిన సంస్కృతి ఉద్భవిస్తుందో, సాహిత్యం, కళలు, విద్యలు ఎంత సవ్యమయిన మార్గంలో వృద్ధి వికాసాలు చెందుతాయో, ఎలాంటి న్యాయవంత మయిన, సానుభూతి నిండిన వివాదరహితమైన ఆర్థిక సహకార వాతావరణం ఏర్పడుతుందో, వ్యక్తిగత, సామూహిక జీవితాలు ప్రతి కోణంలోనూ ఏ విధంగా సంస్కరించబడతాయో తద్వారా జీవితం ఎలా సకల శుభాల సరోవరంగా రూపొందుతుందో ప్రపంచం గ్రహించగలగాలి. (షహదత్-యె-హఖ్)

## మనం పూర్తిగా సదాచారపరులమైతే...

మీరు ఇస్లాం ధర్మాన్ని సరయిన రీతిలో పాటించినట్లయితే వాక్క్రియల ద్వారా మీరిచ్చే సత్య సందేశం, మీ నీతి నడవడికలు మానవ హృదయాలను చూరగొంటూ ఉంటే యావత్ప్రపంచంపై మీ ప్రభావం పడుతుంది. మీ ద్వారానే ప్రజలు న్యాయాన్ని ఆశిస్తారు. మీ నీతి నిజాయితీలపై నమ్మకం ఉంచుతారు.

మీ వాక్కు ప్రమాణంగా పరిగణించబడుతుంది. మీ నుండి మంచిని ఆశిస్తారు. మీకు వ్యతిరేకంగా కుఫ్ర్ శక్తి మచ్చుకయినా మిగలదు. మీ నిజాయితీ ముందు వారి తాత్విక, రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాలన్నీ బూటకాలని రుజువవుతాయి. ఈ రోజు వారి శిబిరాల్లో కనిపిస్తున్న శక్తులు రేపు ఒక్కొక్కటిగా ఇస్లాం శిబిరంలోకి వస్తాయి.

చివరికి ఒక రోజు వస్తుంది. అప్పుడు స్వయంగా కమ్యూనిజం మాస్కోలో తల దాచుకోలేక సతమతమవుతుంది; ప్రజాస్వామిక పెట్టుబడిదారీ వ్యవస్థ ఆత్మ రక్షణ కోసం వాషింగ్‌టన్, న్యూయార్క్ నగరాల్లో పడరానిపాట్లు పడుతుంది; దైవరాహిత్య భౌతిక వాదం లండన్, ప్యారిస్ యూనివర్శిటీల్లో నిలద్రొక్కుకోటానికి వృధాప్రయాసపడుతుంది. కులతత్వం,జాతీయతత్వాలు తమకు ఆటపట్టువయిన బ్రాహ్మణ కులం, జర్మన్ జాతుల్లో కూడా నిలువజాలవు. విశ్వజనీనమూ, శక్తిమంతమూ అయిన ఇస్లాం ధర్మాన్ని ఆశ్రయించినవారు తమ చేతిలో మూసా (అస)లాఠీ ఉండి కూడా మాంత్రికుల త్రాళ్ళను, కర్రలను చూచి భయపడే పిరికి పందల్లా అయ్యారా అని ప్రజలు చెప్పుకునేలా ప్రస్తుతకాలం అప్పుడు చరిత్రలో ఒక గుణపాఠంగా మిగిలిపోతుంది. (Ibid, పే: 22)

## మీరు మరచిన కర్తవ్యం వైపునకే మా పిలుపు

మా సంస్థ మాత్రమే సత్యాన్ని అనుసరిస్తోందని, ఈ సంస్థలో లేనివారంతా అసత్యాన్ని అనుసరిస్తున్నారని మేమెప్పుడూ అనలేదు. తలలో మెదడు ఉన్నంతవరకూ అలా చెప్పము కూడ, మా పార్టీవైపునకు మేము పిలుపునివ్వడంలేదు. మీరు, మేము అంతా ముస్లింలు కావడంవల్ల మనపై మోపబడిన బాధ్యతలవైపునకు మేము పిలుపునిస్తున్నాము. ఈ బాధ్యతల్ని మీరు నిర్వహిస్తుంటే మాతోసహకరించినా, సహకరించకపోయినా మీరు సత్యమార్గంపై నడుస్తున్నట్లే.

కాని మీరు స్వతహాగా ఇస్లాం కోసం పని చేయకుండా ఇస్లాం కోసం పనిచేస్తున్న వారితో సహకరించకుండా కుంటిసాకులు చెప్పుకోవటం;

ధర్మసంస్థాపనకోసం దైవం మీపై మోపిన బాధ్యతలను నిర్వహించకుండా, ప్రపంచమానవాళి ఎదుట సత్యానికి సాక్షులై నిలువకుండా, మీ శక్తిసామర్థ్యాల్ని మాటల, చేతలద్వారా ఇస్లాం ధర్మ సంస్థాపన కోసం వినియోగించడానికిబదులు ఇస్లామేతర విధానాల్లో వినియోగించడం అనేవి మాదృష్టిలో తప్పుగా పరిగణించ బడుతున్నాయి. (Ibid, పే: 27,28)

## అకారణమైన ఆరోపణ

జమాఅతె ఇస్లామి ఇస్లాంలో ఒక నూతనవర్గాన్ని సృష్టిస్తుందని కొందరు ఆరోపిస్తారు. ఇలా అనేవారికి వర్గాలు ఏ కారణాల వల్ల ఉద్భవిస్తాయో తెలియదు. సంక్షిప్తంగా చెప్పాలంటే దీనికి నాలుగు ముఖ్య కారణాలున్నాయి. ప్రథమ కారణం, విశ్వాసంలోలేని అంశాన్నిచేర్చి దాన్నే విశ్వాసం అని చిత్రించడం లేదా విశ్వాసనిరాకరణకు మూలాధారం చేయడం, లేదా సత్యాసత్యాలమధ్య గీటురాయిగా పరిగణించడం. ద్వితీయ కారణం, దివ్యఖుర్ఆన్ మరియు హదీసు వెలుగులో విశ్వాసంలోని, ఒక అంశానికి లేని ప్రాముఖ్యతను ఆపాదించి ఆ అంశానికే అంటిపెట్టుకొని ఉండటం. తృతీయ కారణం, ఒక విషయంలో విపులీకరణకు, స్వేచ్ఛానిర్ణయానికి, అభిప్రాయవ్యక్తీకరణకు అవకాశం ఉండగా దాన్ని కాదని ఒక ప్రత్యేక వ్యక్తి దృక్పథానికి ప్రాధాన్యతనిస్తూ ఆ దృక్పథాన్ని వ్యతిరేకించిన వారిపై నిందలు మోపడం, చివరకు వారిని అవిశ్వాసుల దశవరకు చేర్చడం. చతుర్థ కారణం, ప్రవక్త తర్వాత ఒక ప్రత్యేక వ్యక్తికి ప్రాధాన్యమిస్తూ, అట్టి ప్రాధాన్యతను అంగీకరించేవారు విశ్వాసులని నిరాకరించేవారు అవిశ్వాసులని నిందించడం; ఈ వైఖరిని అవలంబించినవారే సత్యమార్గాన్ని ఆశ్రయించినవారని, లేనివారంతా వక్ర మార్గాన్నాశ్రయించినవారని చెప్పడం. పై నాలుగుసందర్భాలలో మా ధోరణిని పరిశీలించి ఏ విధంగా మేము వర్గీకరించే వారిలో చేరగలమో మీరే చెప్పండి. సహేతుకంగా విషయాన్ని చర్చించి మేము చేసిన తప్పును ఎత్తి చూపినట్లయితే మేమూ తప్పును తప్పక సరిదిద్దుకోగలం. (Ibid, పే: 32)

## ఉద్యమానికి కావలసిన యోధులు

ఏదైనా ఉద్యమం తీసుకోండి. అది నైతికపరమయిన, మతపరమయిన, లేదా రాజకీయపరమయిన ఉద్యమం కానీయండి. ఆ ఉద్యమప్రారంభంలో దాని వైపునకు మరలేవారెవరు? ఉద్యమ లక్ష్యం పట్ల ఎవరికైతే ఆసక్తి ఉంటుందో, ఎవరి హృదయమయితే,"ఈ ఉద్యమం సరయింది, ఆచరణ యోగ్యమైంది" అని ఘోషిస్తుందో వారే ఈ ఉద్యమ పిలుపునందుకొని, నిస్వార్థంతో ముందడుగు వేస్తూ తమ జీవితాల్నే దానికి అంకితంచేసి ఉద్యమ సందేశ వ్యాప్తికోసం నిరంతర కృషి చేస్తారు. ఒకవైపు ఉద్యమం వ్యాపిస్తుంటే, మరోవైపు నిరంతర కృషి సాగుతుంటే, ఉద్యమంలోని సత్యం వారికి మరింత ప్రస్ఫుటమౌతుంది. అందువల్ల వారు ఉద్యమంతో తమ సంబంధాన్ని మరింత పటిష్టం చేసుకుంటారు. ఉద్యమంలోని సత్యాన్ని గుర్తించాక ఉద్యమ యోధుడు ఉన్న చోటే పడి ఉండక, ఉత్సాహంతో ఇంకా ముందుకు పురోగమిస్తాడు. ఏస్థానం నుండి సత్యకాంతులు విరజిమ్మబడుతుంటాయో దాని కేంద్రంవైపునకు ఎన్ని అవాంతరాలు ఎదురయినా వాటన్నిటినీ అధిగమిస్తూ ముందుకు పయనిస్తాడు. ఉద్యమం సత్యమయిందని ఎవరి హృదయాలు తృప్తి నొందుతాయో వారి జీవితాలలో విప్లవాత్మక మార్పులు రావడం తథ్యం. వారి జీవితం పూర్తిగా మారిపోతుంది. అనూహ్యామైన అద్భుత కార్యాలెన్నో వారు అతిసులభంగా నెరవేర్చగలుగుతారు. ఈ మార్గంలో సిద్ధాంతపరమయిన విభేదాలువస్తే వారు మిత్రులకేగాక ఆత్మీయులక్కూడా దూరమౌతారు. వారు ప్రాపంచిక తాపత్రయాలకు అతీతులౌతారు. అధికారం, హోదాలకోసం ఉబలాటపడరు. సమాజంలో అత్యున్నతస్థానాలనబడే వాటిని సైతం సంతోషంగా త్యాగం చేయడానికి సంసిద్ధులౌతారు. ధ్యేయపథంలో హింసా, దౌర్జన్యాలకు గురయినా, కారాగారాల్లో బంధించబడినా చివరకు ప్రాణాల్ని అర్పించవలసి వచ్చినా సరే ఇసుమంతకూడా చలించరు, ఉద్యమ ప్రభావంవల్ల వారి జీవితాలే మారిపోతాయి. వారి తీరుతెన్నుల్లో, దుస్తుల్లో, ఆహారంలో, నడవడికలో అనుదిన కార్యక్రమాల్లో ఒక విశిష్ఠత కానవస్తుంది. ఈ యోధులు

సామాన్య ప్రజానీకానికి వేరుగా ఒక ప్రత్యేకతను సంతరించుకొని ఉంటారు. ఒక విప్లవదళంగా రూపొందుతారు. ఎవరయినా వారిని చూచారంటే "అదిగో ఫలానా ఉద్యమ యోధుడు వెళ్తున్నాడు" అని తప్పక అంటారు.

సిద్ధాంతపరమైన ప్రతి ఉద్యమం ఇలాగే ప్రారంభమవుతుంది. ఉద్యమ లక్ష్యం, సిద్ధాంతాలు ప్రజావాహినిని వడబోస్తాయి. ఎవరెవరి ఆంతర్యాలలోని భావోద్రేకాలను ఉద్యమం ఆకర్షిస్తే వారంతా దానికోసం సమాయత్తమౌతారు. "ఇదే మా ఉద్యమం" అంటు ముందుకొస్తారు. దానికి సారథ్యం వహిస్తారు. దానికోసం తమ జీవితాల్నే అంకితం చేస్తారు.

(ముసల్మాన్ ఔర్ మౌజూదా సియాసీ కష్మకష్, 3వ భాగం, పే: 34-36)

## ఉద్యమానికి పునాదులు

అనేక విప్లవాల చరిత్రను మనం చూస్తున్నాం. ఒక ఉద్యమం, దానికి నాయకులు, కార్యకర్తలు, సామాజిక స్పృహ, ఒక ప్రత్యేక నైతిక నియమావళి, ఒక ప్రత్యేక నాగరికతా వాతావరణం అంటూ ఉండి, ఇవన్నీ విప్లవానికి కావలసిన ప్రత్యేక వసతులకు అనుగుణంగా పనిచేసినప్పుడే విప్లవం అనేది సాధ్యపడుతుంది.

రూసో, ఓల్టయిర్ మరియు మాంటిస్కో తయారుచేసిన నైతిక మానసిక దృక్పథాల ఆధారంగా ఫ్రెంచి విప్లవం పుట్టుకొచ్చింది. మార్క్స్ ఆలోచనాసరళికి ఉత్తేజితులయిన లెనిన్, ట్రాట్స్కీ మరియు వారి నాయకత్వంలో కమ్యూనిజం సూత్రాలకు అనుగుణంగా జీవితాల్ని మలచుకొన్న అసంఖ్యాక కార్యకర్తల సంఘటిత కృషివల్ల రష్యన్ విప్లవం సాధ్యమైంది. జర్మన్ నేషనలిస్టు సోషలిజం అని సాధారణంగా పిలువబడే నాజిజం ఒక విచిత్ర నైతిక మానసిక దృక్పథం గల నాగరికతా వాతావరణాన్ని సృష్టించింది. హేగల్, ఫిజీ, నాజీ లాంటి వారి విభిన్న భావనలు, హిట్లరు నాయకత్వం ఈ విప్లవానికి కావలసినంత సామగ్రిని సమకూర్చిపెట్టాయి.

ఇదే విధంగా, దివ్యఖుర్ఆన్ సిద్ధాంతాల ఆధారంగా, మహాప్రవక్త(సఅసం) దృక్పథాలు, ఆయన ప్రవర్తనావళి, ప్రబోధనల వెలుగులో

జీవితపు అన్నిరంగాల్లో ఒక ఉద్యమం అంటూ రావాలి. ఈ ఉద్యమం ప్రజల మానసిక, నైతిక, నాగరికత విలువల్లో సంపూర్ణ మార్పు తీసుకురావాలి. అప్పుడే ఇస్లామీయ విప్లవం సాధ్యమవుతుంది. (Ibid, పే: 15)

## జమాఅత్ సభ్యుల ప్రవర్తనావళి

జమాఅత్‌లో ఉంటున్నవారు మొత్తం మీద సంస్థ సంక్షేమాన్ని కోరడమే కాకుండా సంస్థలోని ప్రతి కార్యకర్తపట్ల వ్యక్తిగతంగా ప్రేమాభిమానాలుకూడా కలిగిఉండాలి. సంస్థపట్ల అపార్థాలు అనుమానాలు, ఈర్ష్య, వైషమ్యాలు సృష్టించడం, తోటి కార్యకర్తల మనస్సును బాధించడమనేవి చాలాచెడుపనులు. ఇవన్నీ వాస్తవ విశ్వాసాలతో పొసగని చర్యలని దైవప్రవక్త (సఅసం) బోధించారు కూడా.

"నా పార్టీ- నిజానిజాలేమైనా సరే" అనే అన్య పార్టీల ధోరణి లాంటిది కాదు జమాఅత్ వైఖరి. మహోన్నతుడయిన అల్లాహ్ పట్లగల విశ్వాసం జమాఅత్ కార్యకర్తల్ని పరస్పరం కలసిమెలసి ఉండేలా చేస్తుంది. మా స్నేహం, విరోధం, అభిమానం, విద్వేషం, మా ఇష్టాయిష్టాలు సమస్తం కేవలం అల్లాహ్ ప్రీతికోసమే అయి ఉండాలని, మేము స్వీకరించిన దైవ విశ్వాసం మమ్మల్ని కోరుతుంటే మా పరస్పర సహాయ సహకారాలు అల్లాహ్‌పట్ల వినయ విధేయతల్ని ప్రకటించుకోవడానికే కాని ఆయన్ని ధిక్కరించడానికి కాదు.

మేమంతా జమాఅత్ మేలును అభిలషించే వారం అంటే కేవలం బయట నుండి ఎవరయినా జమాఅత్‌పై దాడిచేస్తే అంతా కలసి వారిని ఎదుర్కోవాలని దాని అర్థం కాదు. సంస్థ లోపలకూడ విచ్ఛిన్నకరశక్తులు, అపార్థాలు సృష్టించేవారు ఉన్నట్లయితే వారిపట్ల కూడా అప్రమత్తత కలిగి ఉండాలి. జమాఅత్‌ను ఋజుమార్గం నుండి తొలగిపోకుండా కాపాడటం దుష్ట ఆలోచనల్ని, తప్పుడు పద్ధతుల్ని పాటించనీయకుండా చేయడం, వర్గ కలహాలు తలెత్తనివ్వకుండా అణచిఉంచడం, కార్యకర్తల్ని అతిగా ప్రవర్తించనీయకుండా, వ్యక్తి ఆరాధన ప్రాపంచిక లాభాలకోసం ప్రాకులాడనీయకుండా జాగ్రత్త వహించడం, సంస్థ ప్రవర్తనావళిని అతిక్రమించకుండా ఉండటం వగైరా సంస్థకోసం మేము చేసే గొప్ప సేవ అవుతుంది.

సన్మార్గం నుండి తప్పిపోయే వారిని హెచ్చరించడం, అంతరాత్మ ప్రబోధనలకు వ్యతిరేకంగా నడిచేవారిని వారించడమే ఒక విశ్వాసికి మరో విశ్వాసి చేసే గొప్ప సహాయం. అయితే కార్యకర్తల పరస్పర సంస్కరణ కోసం ఇవ్వబడే సలహా విమర్శ కల్గించేదిగా, తప్పుల్ని ఎత్తిచూపేదిగా ఉండరాదు. అలాంటి సంస్కరణ ప్రయత్నాలు కేవలం మిత్రభావంతోనే జరగాలి.

జమాఅతె ఇస్లామీలో మరో జమాఅత్‌ని ఏర్పరచేందుకు ప్రయత్నించడం, దురదృష్టవశాత్తు అలా ఏర్పడితే దాన్ని సహించడం జమాఅత్ కార్యకర్తలకు ఏ మాత్రం తగదు. ఏ పార్టీ అయినాసరే అందులో కుట్రలు, కుతంత్రాలు, చెడు ఆలోచనలకు తావియ్యడం, చెవులూదడం, పదవులకోసం, ప్రతిష్టకోసం, ప్రాకులాడటం, వర్గస్పర్థలు, వ్యక్తిగతమైన అసూయలు రేకెత్తించడం ఉన్నట్లయితే అవన్నీ పార్టీ ఉనికిని దెబ్బతీస్తాయి. అలాంటి వాటికి ఇస్లామీయ పార్టీ అవకాశమే ఇవ్వదు. అదే విధంగా చాడీలు చెప్పుకోవడం, పేర్లు పెట్టడం, అనుమానాలు సృష్టించడం అనేవి సంస్థకు తీరని హానికలిగిస్తాయి; సంస్థవాతావరణాన్ని కలుషితం చేస్తాయి. వీటిని తొలగించడానికి శాయశక్తులా ప్రయత్నం చెయ్యాలి.

పరస్పర సలహా సంప్రదింపులు జరుపుకోవడం పార్టీ వ్యవస్థకు జీవం లాంటిది. ఈ విషయాన్ని ఏ సందర్భంలోనూ మరువరాదు. సంస్థలో ఎవరైతే బాధ్యతా భారాన్ని మోస్తారో వారు సహచరులతో సంప్రదింపులు జరపాలి. సలహాలిచ్చే వారు కూడా చైతన్య హృదయంతో నిర్భయంగా తమ భావాల్ని వ్యక్తపరచాలి. ఎవరైతే ఒక విషయంపై నిశ్చితాభిప్రాయం కల్గిఉంటూ దాన్ని వ్యక్తపరచకుండా దాచి ఉంచుతారో వారు సంస్థకు హాని చేసిన వారౌతారు. అంతేకాదు, అలాంటివారు మహాపరాధం చేసినవారు కూడా అవుతారు. ఒక విషయంపై చర్చ జరుగుతున్న సందర్భంలో ఎవరైనా మౌనం వహించి, ఆ తర్వాత అతననుకొన్న దానికి భిన్నంగా నిర్ణయం తీసుకోబడినట్లయితే, అతను ఆ నిర్ణయంపట్ల అనుమానాలు సృష్టిస్తూ సంస్థతీసుకొన్న నిర్ణయం

సరయిందికాదని ఆరోపించడం తనపై సంస్థకున్న సదభిప్రాయాన్ని వమ్ము చేసుకోవడమే అవుతుంది. అంటే సంస్థ అతనిపట్ల ఏ విశ్వాసం కల్గిఉందో ఆ విశ్వాసానికి అతని ప్రవర్తన గొడ్డలిపెట్టు అవుతుంది.

(రూదాద్, జమాఅత్ ఇస్లామీ, 1వ భాగం, పే: 21,24)

జమాఅత్ సలహా, సంప్రదింపుల్లో ఏ వ్యక్తీ తన అభిప్రాయం పట్ల మంకుపట్టు పట్టరాదు. తన మాటను అంగీకరిస్తేనే జమాఅత్‌తో సహకరిస్తానని, అలా కాకపోతే ఉమ్మడి నిర్ణయానికి విరుద్ధంగా ప్రవర్తిస్తానని అనేస్థాయిలో మొండిగా వ్యవహరించరాదు. కొందరు అవివేకులు అజ్ఞానంతో ఈ విధానాన్నే ధర్మమైనదని భావిస్తారు. వాస్తవనికి అది ఇస్లామీయ ఆజ్ఞలు, సహబాల (ర) ఆచరణా పద్ధతికి విరుద్ధం. దైవగ్రంథం, ప్రియప్రవక్త (స) పద్ధతుల అన్వయానికి, నిర్వచనానికి సంబంధించిన సమస్య అయినా లేక ప్రాపంచిక యుక్తులూ పద్ధతులకు సంబంధించిన సమస్య అయినా ఈ రెండు సందర్భాల్లోనూ సహబాల (ర) పద్ధతి ఒకటే. సమస్యమీద చర్చ కొనసాగుతున్నంత సేపు ప్రతి వ్యక్తీ తనకు గల జ్ఞానం, తన బుద్ధికుశలత ననుసరంచి అరమరికలు లేకుండా సూటిగా తన అభిప్రాయాన్ని వెల్లడించేవాడు. తన అభిప్రాయాన్ని సమర్థించే రుజువులు, సాక్ష్యాధారాలు ముందుంచేవాడు. కాని నిర్ణయం ఏ వ్యక్తి అభిప్రాయానికి విరుద్ధంగా జరిగినా అతడు తన అభిప్రాయాన్ని విరమించుకునేవాడు. లేక తన అభిప్రాయం సరి అయినదేనని భావిస్తూ విశాల హృదయంతో జమాఅత్‌కు సహకరించేవాడు. సామూహిక జీవితంలో ఈ పద్ధతి అనివార్యమైంది. వేరు మార్గం లేదు. అలా కాకుండ ఒక్కో వ్యక్తి తన అభిప్రాయాన్ని రుద్దడానికి భీష్మించుకుని ఉమ్మడి నిర్ణయాలను అంగీకరించడానికి తిరస్కరిస్తే మాత్రం అక్కడ చివరికి సామూహిక వ్యవస్థ అంతా ఛిన్నాభిన్నమయిపోతుంది.

చివరగా, జమాఅత్ జీవితంలో అతి ప్రధానమైన విషయం, "జమాఅత్, లేకుండ ఇస్లామ్ లేదు. అమీర్ లేకుండ జమాఅత్ లేదు." ఈ మౌలిక సూత్రం

ప్రకారం జమాఅత్ స్థాపన జరిగిన వెంటనే మీరు మీ అమీర్‌ని ఎంపిక చేసుకోవడం అత్యంత ఆవశ్యకం. అమీర్ ఎంపికలో మీరు దృష్టిలో ఉంచుకోవలసిన అంశాల్లో ఇవి: ఇమారత్ పదవిని కాక్షించే వ్యక్తిని ఎంత మాత్రం ఎంపిక చేయరాదు. ఎందుకంటే మహోత్కృష్టమైన ఈ కార్యభారం ఎలాంటిదో తెలుసుకున్న వ్యక్తి ఎన్నడూ ఆ భారాన్ని మోసేందుకు స్వయంగ ముందకు రాడు. కాని అలా అభిలషించే వ్యక్తి అధికారాన్ని చలాయించడాన్ని కోరుకున్నప్పుడే తప్ప బాధ్యతల్ని నిర్వహించగలవాడు కాదు. అందువల్ల అల్లాహ్ సహాయ, సహకారాలు అతనికి ప్రాప్తం కావు. ఎంపికకు సంబంధించి ప్రజలు పరస్పరం సద్బుద్ధితో సంప్రదింపులు చేసుకోవచ్చు. ఒక వ్యక్తి పట్ల తమలోని ప్రేమ మైత్రి భావోద్రేకాలను హృదయం లోంచి తీసివేసి స్వతంత్రంగా ఆలోచించి చూడండి. ఏ వ్యక్తిలో దైవభీతి, చిత్తశుద్ధి, దైవగ్రంథం, దైవప్రవక్త (స) సంప్రదాయ జ్ఞానం, ధార్మిక అంతర్ దృష్టి, పరిశీలనా శక్తి, విషయావగాహన, దైవమార్గంలో సహనస్థయిర్యాలు అత్యధికంగా ఉన్నాయని మీకు నమ్మకం కుదురుతుందో అలాంటి వ్యక్తిని దేవుని మీద భరోసాతో ఎన్నుకోండి. అతణ్ణి ఎన్నుకున్న తరువాత అతని పట్ల శ్రేయోభిలాష, సహకారభావన, మంచిపనుల్లో విధేయత, చెడుపనుల్లో అతని సంస్కరణాభావం కలిగి ఉండటం మీ బాధ్యత.

(రూదాద్-యె-జమాఅతె ఇస్లామీ, మొదటిభాగం, పే:21-26)

## కార్యకర్తల్లో క్రమశిక్షణాభావం

జమాఅత్ కార్యకలాపాల్లో భాగం పంచుకొంటున్న కార్యకర్తలు సంస్థతరఫు నుండి పిలుపురాగానే ఎన్ని పనులు ఉన్నా వదలేసి తక్షణమే సమావేశానికి హాజరు కావడం వారి కర్తవ్యం. దైవాదేశం లేదా మహాప్రవక్త ప్రవచనం అనుమతిస్తే తప్ప సంస్థ కార్యకలాపాలకు గైర్హాజరుకాకూడదు. ఏదయినా సమావేశం ఏర్పాటు చేస్తే అంతకు ముందు నిర్ణయించుకొన్న పనులన్నిటికి స్వస్తి చెప్పి జమాఅత్ సమావేశానికి హాజరుకావాలి. ఉద్యమం సజీవంగా ఉండడానికి కార్యకర్తల్లో ఇలాంటి మనస్తత్వం ఉండటం చాలా అవసరం. సమావేశంలో ప్రత్యేకత ఏమీ లేదని, అక్కడ పరిశీలించడానికి

ముఖ్యమైన అంశం లేదని భావిస్తూ సమావేశానికి హాజరు కాకపోవడం, లేదా నేను వెళ్ళకపోయినంత మాత్రాన అక్కడ మునిగిపోయిందేమీ లేదని తలచి గైరుహాజరు కావడం తప్పు. జమాఅత్ సమావేశంలో ప్రత్యేకత, పరిశీలించటానికి పెద్ద కార్యక్రమం లేకపోయినప్పటికీ, కేవలం సమావేశమవడానికి ఆదేశం అందితే ఆ సమావేశానికి తప్పనిసరిగా హాజరుకావాలి. ఎందుచేతనంటే సంస్థ పిలుపునందుకొని సమావేశానికి హాజరు కావాలనే అలవాటు కార్యకర్తల్లో కలగడం కూడా ఒక అమూల్యమయిన శిక్షణే అవుతుంది. మన ముందున్న కర్తవ్యం మహోన్నతమయింది. కరచాలనంతో ప్రశంసలు అందుకునే పనికాదు. ఈ పని నిర్వహించేందుకు ఉన్నతమయిన క్రమశిక్షణ కార్యకర్తల్లో ఉండాలి. ఇలాంటి క్రమశిక్షణ అకస్మాత్తుగా సాధ్యపడదు. క్రమేణ అలవడుతుంది. ఈ క్రమశిక్షణకు కట్టుబడి ఉండలేని వారు సంస్థలో ప్రభావాన్ని కూడా కలిగి ఉండలేరు. (రూదాద్, జమాఅతె ఇస్లామీ, 2వ భాగం, పే: 13,14)

## జిహాద్ - "స్వయం" పై సమరం

ఇస్లామీయ పోరాటంలో తీసుకోవలసిన మొదటి చర్య "స్వయం"పై సంపూర్ణ ఆధిపత్యం కలిగి ఉండటం, స్వయాన్ని జయించి దాన్ని దైవాజ్ఞలపట్ల విధేయత కలిగేలా, పరిపూర్ణంగా ప్రవర్తించేలా చేయాలి. మహాప్రవక్త (సఅసం) ప్రవచనంలో ఉన్న భావం కూడా అదే. దైవ విధేయత కోసం "స్వయం" తో సమరం చేసే వ్యక్తే నిజమయిన ముస్లిం అని ఆయన సెలవిచ్చారు. అంటే నీ చుట్టుపట్ల ఉన్న దైవద్రోహుల్ని ఎదుర్కునే ముందు నీలో ఉన్న శత్రువుని అణచివేయాలి. దైవాదేశానికి, ప్రవక్త హితువుకు వ్యతిరేకంగా నడిచేందుకు ఈ శత్రువు నిరంతరం నిన్ను ప్రేరేపిస్తుంటాడు. అందువల్ల ముందీ స్వయాన్ని అణచిపెట్టాలి. ఒకవేళ నీలో దాగిఉన్న శత్రువుకు నీ చర్యలపై పెత్తనం చెలాయించే అవకాశమిచ్చి దైవాజ్ఞలకన్నా దాని కోరికలకే ఎక్కువ ప్రాముఖ్యతనిస్తూ ఉంటే బాహ్య శత్రువులతో నీవు చేసే పోరాటం ఒక మిధ్యపోరాటంగానే మిగిలిపోతుంది. అంటే ఇంట్లో భారీ ఎత్తున మధ్యపానీయాన్ని సమకూర్చుకొని బయట మద్యనిషేధ ఉద్యమం ప్రారంభించి వీధుల వెంట

తిరిగినట్లు ఉంటుంది. అందువల్ల నీవు ముందు స్వయాన్ని దైవంపట్ల విధేయత కలిగి ఉండేలా చేసి ఆ తర్వాత ఇతరుల్ని దైవం వైపునకు పిలవాలి.

## హిజ్రత్ ప్రాముఖ్యత

ఇస్లాం ఆరాధనల్లో "జిహాద్" తర్వాత "హిజ్రత్" ప్రాధాన్యత వహిస్తుంది. హిజ్రత్ అంటే జన్మభూమిని విడనాడి వెళ్ళటమనేదే కాదు, దైవ అవిధేయతను విడనాడి ఆయన పట్ల సంపూర్ణ విధేయత ప్రకటించడం కూడా హిజ్రత్ అవుతుంది. ఒక "ముహాజిర్" జన్మభూమిని విడనాడి పోవలసివస్తుంది - ఎందుచేత? అక్కడ అల్లాహ్ ఆజ్ఞానుసారం ధార్మికజీవితం గడిపేందుకు అతనికి సాధ్యపడటంలేదు కాబట్టి. అయితే ఎవరైనా "హిజ్రత్" మాత్రమే పాటిస్తూ ఇస్లాం బోధనలకు అనుగుణంగా తన జీవితాన్ని మలచుకోలేకపోతే అంతకంటే అవివేకి మరొకడుండడు. ఈ విషయమే మహాప్రవక్త (సఅసం) ప్రవచనాల్లో స్పష్టంగా తెలియజేయబడింది. "దేవునికి ఏది నచ్చదో దాన్ని విడనాడండి" అని సెలవిచ్చారు ఆయన.

అంతరంగంలో ఉన్న శత్రువుని ముందు అదుపులోకి తీసుకోనట్లయితే (దైవదృష్టిలో) జన్మభూమి పరిత్యాగానికి ఎలాంటి విశిష్టత ఉండదు. దైవప్రవక్త (సఅసం) ప్రవచనాల్లో ఉదాహరించినట్లు మనిషి గాటికి కట్టిన గుఱ్ఱంలా మసలుకోవాలి. గాటికి కట్టివేయబడిన గుఱ్ఱం ఎంతమేరకు తిరగటానికి వీలవుతుందో అంతమేరకే తిరగ్గలదు. అంతకుమించి పోజాలదు. అలాగే దైవంపట్ల విధేయత అనేది మనిషికి ఒక బంధనం లాంటిది. ఈ బంధనమే లేకపోతే ఏ విధంగా తాడు కట్టబడని పశువు పచ్చగా కనబడిన ప్రతిచోటికి పరుగులు పెడుతూ విచ్చలవిడిగా సంచరిస్తుందో అదే విధంగా మనిషికూడా విశృంఖలంగా వ్యవహరించే అవకాశం ఉంది.

## ఇంటిని చక్కబెట్టుకోండి

ఈ మార్పుతో పాటు రెండవ చర్య, మీ సమీప వాతావరణంతో పోరాటం ప్రారంభించడం. దానిని నేను హోమ్ ఫ్రెంట్ (Home Front) అని అంటాను.

ఇంటివారు, బంధువులు, మిత్రులు, సొసైటీలో మీకు దగ్గరి సంబంధం ఉన్నవారందరితో క్రియాత్మకమైన సంఘర్షణ ప్రారంభం కావాలి. సంఘర్షణ అంటే మీరు మీ సంబంధీకులతో కుస్తీ పట్టడం అనీ, వారితో అమీతుమీ తేల్చుకోవడం అనీ వాదులాటకు పూనుకోవడం అనీ అర్థం కాదు. ఈ సంఘర్షణకు అర్థం వేరు. మీరు ఒక వ్యక్తిగా, ఒక జమాఅత్‌గా మీ ధ్యేయానికి ఎంతగా అంకితమయి పోవాలంటే, మీ సూత్రాలకు సిద్ధాంతాలకు ఎంతగా కట్టుబడి నిలువాలంటే మీ చుట్టూ లక్ష్యరహితంగా, సూత్రవిహీనంగా జీవించే జనులు మీ సూత్రబద్ధ జీవితాన్ని సహించలేకపోవాలి. మీ భార్యలు, మీ సంతానం, మీ తల్లిదండ్రులు, మీ బంధువులు, మీ మిత్రులు మీ వైఖరికి వ్యతిరేకంగా అడ్డుగోడలా నిల్చుండాలి. మీరు మీ పట్టణంలోనే అపరిచితులయి పోవాలి. మీరు మీ జీవనోపాధి కోసం పనిచేసే చోట మీ ఉనికి కంటకప్రాయంగా మారాలి. సాధారణంగా సుఖంగా కూర్చోవడానికి, పదవులు, ప్రగతుల కలలు కనడానికి ఉపకరించే ఆఫీసు కుర్చీ మీకు మండే కొలిమిలా కానరావాలి. ఇంతకూ ఎవరు ఎంతగా మీ సమీపాన ఉంటారో వారితో అంతే త్వరగా సంఘర్షణ ప్రారంభం కావాలి. ఇంట్లోనే జిహాద్ (సతత సమర) రంగం ఉంటే ఎవరైనా ఎన్నో మైళ్ళు వెళ్ళి సంఘర్షించడం ఎందుకు? మొట్టమొదటి సమరం ఇంటి నుండే ప్రారంభం కావాలి.

(26.3.1944 రూదాద్, జమాఅతె ఇస్లామీ రెండవ భాగం, పే:28-31)

# ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తలలో ఉండాల్సిన వ్యక్తిగత గుణగణాలు

## సహనం

ప్రప్రథమంగా ఉద్యమకార్యకర్తల్లో సహనం ఉండాలని నొక్కి చెప్పబడింది. సహనం లేకుండ దేవుని మార్గంలోనే కాదు, మరే మార్గంలోనూ సంఘర్షించలేము. భేదం కేవలం ఒక్కటే, అల్లాహ్ మార్గంలో కావలసిన సహనం వేరు, ప్రాపంచిక ప్రయోజనాల కోసం సంఘర్షించేందుకు కావలసిన సహనం వేరు, ఎట్టి పరిస్థితిలోనూ సహనం తప్పనిసరి. సహనానికి ఎన్నో కోణాలు.

ఒక కోణం, తొందరపాటుకు పూర్తిగా దూరమవడం. రెండవ కోణం, ఓ మార్గంలో పోరాడుతూ కష్టాలను, వ్యతిరేకతల్ని ఎదిరించి స్థయిర్యం చూపడం, వెనుకంజవేయకుండా నిలకడ చూపడం. మూడవ కోణం,ప్రయత్నాల ఫలితాలు త్వరగా ప్రాప్తం కాకపోయినా ధైర్యం సడలిపోకపోవడం, నిరంతర కృషి కొనసాగనివ్వడం. మరో కోణం, లక్ష్య మార్గంలో పెద్ద పెద్ద ప్రమాదాలు, ఆపదలు, నష్టాలు, భయప్రలోభాలు ఎదుర్కోవలసి వచ్చినా అడుగు తడబడరాదు. తీవ్రాతితీవ్రమైన భావోద్రేకాలు ప్రకోపించిన సమయాన కూడ మనిషి తన వివేకం, బుద్ధి సంతులనాన్ని కోల్పోరాదు. ఉద్రేకాలకు లోబడి ఏ చర్యా తీసుకోరాదు. ఎల్లవేళలా ప్రశాంత చిత్తంతో, బుద్ధి కుశలతతో చల్లని గుండెలతో, సంకల్ప స్థిరత్వంతో పనిచేస్తూ ఉండాలి. అలా కేవలం సహనం వహించమనే కాదు, స్థయిర్యం కూడా కలిగి ఉండాలన్నదే ఆదేశం. అంటే ప్రతీపశక్తులు తమ మిథ్యా ఆశయాల కోసం ఎలా సహనంతో ఎదిరించి నిలకడగా పోరాడుతున్నాయో, ఆ సహనంతోనే మీరు కూడ నిలకడతో ఎదిరించాలి. అందుకే 'ఇస్బిరూ' (సహనం వహించండి)తో పాటు 'సాబిరూ' (స్థిరత్వం కనబరచడండి) అనే ఆజ్ఞ కూడ ఇవ్వబడింది. భావం, ఎవరికి విరుద్ధంగా మీరు సత్యధ్వజాన్ని చేబూని ఉద్యమించారో వారి సహనంతో మీ సహనాన్ని పోల్చి చూసుకోండి. మీ సహనం వారికెదురుగా ఏ మాత్రమో పరిశీలించండి. బహుశా మనం వారికి ప్రతిగా 10 శాతం కలిగి ఉన్నామని కూడా చెప్పగల స్థితిలో లేమేమో! మిథ్యా ప్రాబల్యానికి వారు చూపుతున్న సహనాన్ని ఏంచనా వేసేందుకు ప్రస్తుత యుద్ధ పరిస్థితుల్ని గమనించండి. ప్రమాదం ముంచుకు వచ్చిన సమయాన ఎలా వారు తమ కర్మాగారాలను, పట్టణాలను, రైల్వేస్టేషన్లను చేజేతులా సర్వనాశనం చేసివేశారో పరిశీలించండి. వాటి నిర్మాణానికి ఎన్నో సంతవ్సరాలు, ఎంతో ధన సంపత్తిని ఖర్చు పెట్టారు. శక్తిమంతమైన సేనలను తమ ఉక్కు చక్రాల క్రింద నల్లిలా నలిపి వేసే టాంకుల ముందు వారు రొమ్ము విరుచుకు నిలబడతారు. మృత్యురెక్కలు ధరించి బాంబులు కురిపించే శత్రు విమానాల ఛాయల్లో వారు స్థయిర్యంతో నిల్చుంటారు. వారి సహనానికి ఎదురుగా మన సహనం 105 శాతం పెరిగే వరకు వారిని ఎదిరించేందుకు సాహసించలేము. వస్తు సామాగ్రి రీత్యా ఏ స్థాయిలోనూ నిల్చోలేని మనం ఆ వస్తుసామగ్రి లోపాన్ని సహనంతోనే పూడ్చగలం.

## త్యాగం

నిరంతర పోరుకు అవశ్యమైన రెండవ లక్షణం త్యాగం. సమయత్యాగం, శ్రమ త్యాగం, ధన త్యాగం. ఈ త్యాగ నిరతిలో కూడ మిథ్యావాద శక్తుల కంటే మనం చాలా వెనుకబడి ఉన్నాం. వస్తుసామగ్రి లోపాన్ని పూడ్చేందుకు త్యాగనిరతి రీత్యా కూడ మనం వారికంటే ఎన్నో మైళ్ళు ముందు ఉండవలసింది. కాని ఇక్కడ వాస్తవంగ జరుగుతున్నదేమిటంటే ఒక వ్యక్తి 20, 50, 100, 1000 రూపాయల నెల జీతానికి తన సామర్థ్యాలన్నింటినీ శత్రువుకు అమ్ముకుంటున్నాడు. ఈ విధంగా మన జాతి ఉపయోగకర శక్తి దేనికీ కొరగాకుండపోతున్నది. మేధాసంపత్తి గల ఈ వర్గం ఒక పెద్ద ఆదాయాన్ని త్యజించి స్వల్ప జీతభత్యాల మీద తమ సేవలు అందించేందుకు సాహసించడం లేదు. ఇక మీరే చెప్పండి. ఒకవేళ వారు ఈ కొంచెం త్యాగమైనా చేయకపోతే, ఈ మార్గంలో మనస్సును చంపుకుని పనిచేయకపోతే ఇస్లామీయ ఉద్యమం ఎలా పెరిగి పుష్పిస్తుంది, ఫలిస్తుంది. ఏ ఉద్యమమైనా కేవలం వాలంటీర్ల మీద ఆధారపడి నడవజాలన్నది వాస్తవం. సామూహిక వ్యవస్థలో వాలంటీర్ల స్థాయి ఒక మనిషి శరీర వ్యవస్థలో చేతులు, కాళ్ళవంటిది. ఈ చేతులు, కాళ్ళు, ఇతర అవయవాలతో పని తీసుకునేందుకు స్పందించే హృదయం, ఆలోచించే మెదడు లేకపోతే అవి ఏ పని చేస్తాయి, ఎలా చేస్తాయి. మరో మాటలో చెప్పాలంటే వాలంటీర్లతో పని చేయించుకునేందుకు ఉన్నతస్థాయి జనరల్స్ అవసరం. కాని విచారకర విషయం ఏమిటంటే, హృదయం, మేధాశక్తులున్న వారు ప్రాపంచిక ప్రగతుల పట్ల ఆకర్షితులవుతున్నారు. ఎక్కువ ధర చెల్లించే మార్కెట్ వైపునకు వారు పరుగులు తీస్తున్నారు. ధ్యేయం పట్ల మన జాతి ఉత్తమ వ్యక్తుల శ్రద్ధాసక్తులు అంతగాలేవు. దాని కొరకు వారు తమ లాభాలను, ప్రయోజనాలను, ప్రయోజనాల అవకాశాలను త్యాగం చేయడానికి సిద్ధంగా లేరు. ఈ మాత్రపు త్యాగంతో రోజూ కోట్లాది రూపాయల్ని, లక్షలాది ప్రాణాలను, త్యాగం చేస్తున్న ప్రపంచ దుష్టశక్తులు ఎప్పుడైనా మన చేతుల్లో పరాజయం పొందుతాయని ఆశించడం సాధ్యమా? అది పిట్ట కొంచెం, కూత ఘనం లాంటిది కూడా. (Ibid, పే: 39-40)

## మానసిక ఏకాగ్రత

దేవుని మార్గంలో సంఘర్షణకు అవసరమైన మూడవ లక్షణం మానసిక ఏకాగ్రత. కేవలం మేధాపరంగ ఒక వ్యక్తి ఈ ఉద్యమాన్ని అర్థం చేసుకుని బౌద్ధికంగా తృప్తి చెందడం ఈ మార్గంలో వేసిన ఒక ప్రాథమిక అడుగు మాత్రమే. కాని ఈ స్వల్ప ప్రభావం వల్ల పని నెరవేరదు. ఇక్కడ హృదయంలో ఒక అగ్నిజ్వాల ప్రజ్వరిల్లాలి. అధికంగా కాకపోయినా, కనీసం మీ పిల్లవాడు జబ్బుపడితే మీలో కలిగే ఆందోళన, ఆవేదన మిమ్మల్ని డాక్టరు వద్దకు తీసుకువెళుతుందే, కనీసం ఆ మేరకయినా జనించాలి. లేదా పిల్లవాడి జబ్బు మిమ్మల్ని ఆందోళనకు గురిచేసి ఏదైనా చేయాలన్న తపనలో పడవేస్తుంది, ప్రశాంతంగా కూర్చోనివ్వదు. అలాగే మీ ధ్యేయం పట్ల మిమ్మల్ని మనోమేధా శక్తులతో పాటు కలతకు గురిచేసే భావన మీ హృదయంలో ఏర్పడాలి, మీ హృదయం, మేధ ఏకోన్ముఖమయి పోవాలి. ఒకవేళ మీ వ్యక్తిగత పనులుగాని, ఇతర సంబంధంలేని పనులుగాని మీ శ్రద్ధాసక్తుల్ని భంగపరిచినా అయిష్టంగానే ఆ పనులు చేయాలి. మీ స్వంత పనుల కొరకు చాలా తక్కువ సమయం, శక్తుల్ని వెచ్చించేందుకు ప్రయత్నించండి. మీ అత్యధిక కృషి మీ జీవిత లక్ష్యం కొరకే వినియోగపడేలా చూడండి. ఈ ఏకాగ్రత లేకపోతే, మీరు సంపూర్ణంగా ఈ కార్యంలో నిమగ్నమవకపోతే కేవలం చిలుక పలుకులతో పని నెరవేరదు. చాలా మంది బౌద్ధికంగా మనకు సహకరించేందుకు సిద్ధంగా ఉన్నారు. కాని ఏకాగ్ర చిత్తులయి, తమ తనువు, మనసు, ధనంతో ఈ కార్యంలో పాల్గొనే వారు చాలా తక్కువ మంది. నాతోనూ, జమాఅత్‌తోనూ గట్టి సంబంధమున్న నా సమీప మిత్రులు ఒకరు, రెండు సంవత్సరాల మైత్రి తరువాత ఒప్పుకున్నారు, తాను ఇప్పటి వరకు కేవలం మేధోపరమైన సంతృప్తి కారణంగా జమాఅత్‌లో చేరి ఉన్నాడని, కాని ఇప్పుడు అది తన హృదయంలో గూడు కట్టుకుందని, అది తన ఆత్మనంతా ఆవరించుకున్నదనీ అన్నాను. అలాగే ప్రతి వ్యక్తి తనను తాను విమర్శించుకుని తాను జమాఅత్‌కు కేవలం మేధాపరమైన కార్యకర్తలాగే ఉన్నాడా, లేక తన హృదయంలోనూ ధ్యేయం పట్ల ప్రేమాగ్ని జ్వలించిందా? పరిశీలించుకోవాలి. హృదయంలో ఏకాగ్రత జనించకపోతే దాన్ని జనింపచేసేందుకు ఆలోచించాలి. ఎవరి హృదయంలో కార్యదీక్ష ఉంటుందో వారిని ప్రోత్సహించి ముందుకు నడిపించే వారి అవసరం ఉండదు. ఆ శక్తి

ఉన్నచోట ఒక కార్యకర్త వెనకబడి పోయినా లేక అతను ఇంకో చోటుకు వెళ్ళిపోయినా అక్కడ పని అంతా స్తంభించిపోయే పరిస్థితి ఏర్పడజాలదు. అక్కడ ప్రతి ఒక్కడూ తన సంతానం వ్యాధి గ్రస్తుడయినప్పటిలా పాటుపడటం ప్రారంభిస్తాడు. (Ibid, పే: 40-41)

## నిరంతర కృషి

ఈ మార్గంలో అవశ్యమైన నాల్గవ లక్షణం, నిరంతర ప్రయత్నం, అవిరళ కృషి, క్రమానుగతంగా (Systematically) పని చేసే అలవాటు. చాలా కాలంగా మన జాతి ఏ పని చేసినా అది తక్కువ సమయంలో జరగాలన్న అలవాటు గలది. ఏ అడుగువేసినా అందులో హంగామా, ఆర్భాటం ఉండి తీరాలంటుంది. రెండు, మూడు మాసాల్లో చేసిన పని అంతా నాశనమైపోయినా సరే. ఈ అలవాటును మనం మార్చుకోవాలి. ఒకక్రమంలో ఆర్భాటాలు లేకుండ పనిచేసేందుకు అలవర్చుకోవాలి. అత్యవసరమైనదైన ఏ చిన్న పనినైనా మీకు అప్పగిస్తే, వేగంగ లభించే ఫలితం, ప్రదర్శన, పొగడ్తలను ఆశించకుండ జీవిత కాలమంతా సహనంతో ఆ పని నిర్వహణలోనే గడిపి వేయండి. దైవమార్గంలో కృషి జరిగేటప్పుడు ఎల్లప్పుడు రంగం వేడివేడిగనే ఉండదు. ప్రతి వ్యక్తి ముందు వరసల్లోనే పోరాడలేడు. ఒక్కసారి రంగంలో దిగేందుకు, ఒక్కోసారి పాతికేళ్ళ వరకు మౌనంగ సన్నాహాలు చేయవలసి ఉంటుంది. మొదటి వరుసలో వేలాది మంది పోరాడుతూ ఉంటే వారి వెనుక లక్షలాది మంది యుద్ధ అవసరాలకు సంబంధించిన చిన్న చిన్న పనుల్లో నిమగ్నులయి ఉంటారు. ఆ పనులు చూడ్డానికి అల్పమైనవిగా కానవస్తాయి. (Ibid, పే: 43-44)

## పాలకుల గుణగణాలు

ఇస్లామీయ రాజ్యాన్ని నడిపే వ్యక్తులలో ఇతర గుణాలతో పాటు ప్రత్యేక లక్షణాలుండాలి. పరిపాలన యంత్రాంగ బాధ్యతలు నిర్వహించే వారి హృదయాలు దైవభయంతో నిండి ఉండాలి. సృష్టికర్త ఎదుట నిలబడి జవాబు చెప్పుకొవాలన్న బాధ్యాత భావం వారిలో ఉండాలి. ప్రపంచంలో వారికి దొరికే లాభం కన్నా పరలోకంలో లభించే ప్రతిఫలం పట్ల ఎక్కువ ఆసక్తి ఉండాలి.

భౌతిక లాభనష్టాలకంటే నైతిక లాభనష్టల పట్ల ఎక్కువ మక్కువ ఉండాలి. అన్ని పరిస్థితుల్లోను వారు తమకోసం శాశ్వతంగా నియమించబడిన క్రమశిక్షణ నిబంధనలకు కట్టుబడి ఉండాలి. చేసే ప్రతి పనిలోను ప్రభువు సంతోషాన్ని పొందే అభిలాష ఉండాలి. అత్యాశలు, జాతి కోరికలు, వ్యక్తిగత వాంఛలకు బానిసలు కారాదు. సంకుచిత భావాలకు, దురభిమానాలకు లోబడకుండా, కలిమి కోసం, అధికారం కోసం అంధులు కాకుండా ఉండాలి. ధనం వ్యామోహం కాని, అధికార కాంక్ష కాని కలిగి ఉండరాదు. ప్రపంచ సిరిసంపదలు వారి అధీనంలో వచ్చినప్పుడు నిజాయితీపరులుగా, అమానుతుదారులుగా వ్యవహరించాలి. రాజ్యపాలనాధికారం వారిచేతులకిచ్చినపుడు వారి రక్షణలో ఉన్న ప్రజల యోగక్షేమాల కోసం రేయింబవళ్లు ఆలోచిస్తూ ఉండాలి. ప్రజలు సంపూర్ణ శాంతితో, సంతృప్తితో వారి ఆస్తిపాస్తుల భద్రతతో జీవించగలగాలి. ఇలాంటి పరిపాలన దక్షత కలవారు ఇతర దేశాలపై దండెత్తి వాటిని జయించుకోగలిగితే అక్కడి పరాజయ శక్తులు ఇక తాము చంపబడుతామనే అనుమానం కూడా కలిగి ఉండరాదు. అక్కడి ప్రజల సొత్తు దోచుకోవడం గాని, ఆస్తులు తగులబెట్టబడడం గాని, మహిళల మానభంగాలు కాని జరుగడం అసాధ్యం. విజయభేరి మ్రోగించిన ముస్లిం సైన్యం అక్కడి ప్రజల మాన ధన ప్రాణ రక్షకులుగా వ్యవహరించాలి. అక్కడి స్త్రీల మానమర్యాదలను కాపాడగలగాలి. అంతర్జాతీయ వ్యవహారాలలో వారి చక్కటి ప్రవర్తన చూసి ప్రజలు ముగ్ధులైపోవాలి. వారి ధృఢమైన సమైక్యత, న్యాయంపట్ల ప్రేమ, ఉన్నత నైతిక విలువలు చూస్తు వేనోళ్ళపొగడాలి, ఇలాంటి గుణగణాలు కలవారే ఇస్లామీయ రాజ్యాన్ని స్థాపించి దానిని పరిపాలించవలసిన విధంగా పరిపాలించగలరని చెప్పగలం.

(ముసల్‌మాన్ అవుర్ మౌజూద సియాసి కష్మకష్ 3వ భాగం, పే: 211, 212)

## మహిళల పాత్ర :

### మహా ప్రవక్త (సఅసం) ఉద్యమంలో మహిళల పాత్ర

ఇస్లామీయ ఉద్యమ చరిత్రను అధ్యయనం చేస్తే స్త్రీలు పురుషులతో సమానంగ ఉద్యమంలో పాలుపంచుకొన్నారని అర్థమవుతుంది. ముహమ్మద్

(సఅసం) ప్రారంభించిన ఉద్యమంలో ప్రప్రథమంగ విశ్వాసం ప్రకటించినవారు ఒక మహిళ – హజరత్ ఖదీజ(రజి). ఈమె ఉమ్మహాతుల్ మోమినీన్ (విశ్వాసుల మాతృమూర్తుల)లో ఒకరు. ప్రప్రథమంగ ప్రవక్త బాధ్యతలను ముహమ్మద్ (సఅసం)పై మోపినపుడు ఆయన హృదయం కంపించిపోయింది. అప్పుడు ఆమె మహాప్రవక్త (సఅసం)ను ఓదార్చి శాంతపరిచారు. మొదటి పది సంవత్సరాల వరకు ఆయన జీవితం దుర్భరమైంది. ఆపదల వెల్లువలు వచ్చి పైనపడ్డాయి. అట్టి సమయంలో హజరత్ ఖదీజ (రజి) ఆయనకు తోడునీడగా ఉంటూవచ్చారు. దైవం ఇచ్చిన ఐశ్వర్యాన్ని దైవమార్గంలో ఖర్చు చేశారు ఆమె.

ఇస్లామీయ ఉద్యమ మొదటి మూడు సంవత్సరాల కాలంలో ఏబది ఐదుమంది ఇస్లాం స్వీకరించారు. వారిలో తొమ్మిది మంది మహిళలున్నారు. ఏడు ఎనిమిది ఏండ్ల ఉద్యమకాలంలో ముస్లింలపై ఆపదలొచ్చాయి. భరించరాని పరిస్థితుల్ని ఎదుర్కొనవలసి వచ్చింది. వారిపై జరిగిన దురాగతాలకు హద్దులుండేవి కావు. అప్పుడు 83 మంది ముస్లిములు అబిసీనియాకు వలసవెళ్ళారు. వలస వెళ్ళిన వారిలో 18 మంది మహిళలున్నారు. వారు పరదేశంలో కలిగే ఆపదలను తమ అన్నదమ్ములు మరియు భర్తలతో పాటు అనుభవించారు. మక్కా పట్టణంలో అవిశ్వాసుల చేతుల్లో బాధలకు గురైన వారు హజ్రత్ బిలాల్ (రజి), హజ్రత్ అమ్మార్ (రజి) ఉండగ, వారితో సమానంగా బాధలకు గురైన వారిలో హజ్రత్ ఉమ్ ఉబైస్, ఉమ్ అమ్మార్, హజ్రత్ జిన్నిరా ఉన్నారు. అలాగే మదీనా పట్టణంలో అన్సారీలు ఇస్లాం కోసం అమూల్యమైన త్యాగాలు చేశారు. మహిళలు కూడా అందులో ఏ మాత్రం వెనుకలేరు. ఉహద్ మహాసమరంలో ఇస్లాం కోసం యుద్ధం చేస్తూ తనయుని, తండ్రిని తుదకు పెనిమిటిని సయితం పోగొట్టుకొన్న ఒక మహిళ ఏమని విచారించింది "చెప్పండి! అల్లాహ్ ప్రవక్త సురక్షితంగా ఉన్నారా?" అని అడిగింది. ఎప్పుడైతే ఆయన సురక్షితంగా ఉన్నట్లు చూచిందో అప్పుడు: "ఆయన (సఅసం) క్షేమంగా ఉంటే చాలు నేను ఎలాంటి కష్టాన్నైనా భరించగలను." అదే ఉహద్ సంగ్రామంలో హజ్రత్ ఉమ్మె అమ్మార్ గాయపడిన వీరయోధులకోసం నీరు మోసుకొని

వెళ్తూంది. మహాప్రవక్త (సఅసం) గాయపడడం, ఆయన (సఅసం)ను అవిశ్వాసులు చుట్టుముట్టడం ఆమె (రజి) చూచారు. వెంటనే చేత కరవాలంపూని, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఎదుట నిలిచారు. శత్రువులను ఎదుర్కొన్నారు, వారిని దూరం చేస్తున్నారు. ఈ పోరాటంలో ఆమె భుజానికి గాయమయింది. ఇదేకాక అనేక సంఘటనలున్నాయి. ఇస్లాం కోసం పురుషులు చేసిన పనులన్నీ మహిళలు కూడా వారికి ఏమాత్రం తీసిపోకుండా చేశారు. ఇస్లాం కోసం మహిళలు కూడా విరోధుల చేతుల్లో దౌర్జన్యానికి బలయ్యారు. అన్ని కష్టాలకు వారు గురయ్యారు. తమతమ ఆస్తులను, జీవితాలను త్యాగం చేశారు. బంధుత్వాలను వీడారు. ఆత్మీయులకు దూరమయ్యారు. పట్టణ, దేశ బహిష్కరణ ఇబ్బందులను ఎదుర్కొన్నారు. పస్తులుంటూ తమ తమ సోదర్లు, తండ్రులు, భర్తలు సత్యధర్మం కోసం పడుతున్న బాధలలో పాలుపంచుకొన్నారు. ఆనాడు స్త్రీలు చూపిన ధైర్యస్థయిర్యాలు, త్యాగాల వల్ల ఇస్లాం ప్రపంచంలో ఆధిక్యత వహించింది. ఈనాడు మళ్ళీ ఈ ధర్మం ఆధిక్యత వహించాలంటే నేటిఆధునిక ముస్లిం మహిళలు ఆనాటి త్యాగధనులైన మహిళల అడుగుజాడలలో నడుస్తూ స్వచ్ఛమైన ఇస్లామీయ విశ్వాసాన్ని వ్యక్తపరచాలి. (తర్జుమానుల్ ఖుర్‌ఆన్,1947, పే:70)

